

Chandamama Feb. '49 — Photo by B. Ranganatham

మేము ఆడుకుంటున్నాం



కృష్ణా పిక్చర్సు వారి,

# కృష్ణభక్తి

రాజకుమారి... చిన్నప్ప... కృష్ణన్... మధురం...

19-1-49 నుండి 2-వ వారము

విజయవాడ - జైహింద్ టాకీస్

తెనాలి - స్వరాజ్ టాకీస్

21-1-49 నుండి

కాకినాడ - క్రౌన్ టాకీస్, భీమవరం - వెల్‌కం టాకీస్

బళ్లారి - స్టార్ సినిమా, అమలాపురం - శ్రీగోపాలకృష్ణ

త్వరలో విడుదల

విజయనగరం, రాజమండ్రి,

గుంటూరు, కర్నూలు, చీరాల

మీ అభిమాన ధియేటర్సులో.



SARMA TVS

సరస్వతీ రిలీజ్.

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు,
చిక్కుచదరాలు, చిక్కుబొమ్మలు,
ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.

# ఆంధ్రజ్యోతి

ఉగాది సంచిక



ప్రఖ్యాత కథకుల ఉత్తమ రచనలతో,
అందమైన ఏకవర్ణ, త్రివర్ణ, వ్యంగ్య చిత్రాలతో,
రెట్టింపు పేజీలతో ఎంతో ఆకర్షవంతంగా

ఏప్రిల్ 1-న వెలువడుతుంది

సంచిక వెల: రు. 1-0-0



చందాదారులకు ఉచితం
నేడే చందాదారులుగా చేరండి
సాలుచందా 5-8-0 :: రెండేండ్లకు 10-0-0



ఏజంట్లు తమ తమ ఆర్డర్లను
త్వరగా పంపాలని కోరుతున్నాము



ఆంధ్రజ్యోతి కార్యాలయం

37, ఆచారప్పన్ వీధి, మద్రాసు 1.

# అట్టపీదిబొమ్మ

**చెరసాలలో** వున్న దేవకీ వసుదేవులకు విష్ణుమూర్తి ప్రత్యక్షమయినట్టు కిందటిసారి చెప్పానుకదా. దేవకిదేవి ఆయనకు నమస్కరించి 'మహానుభావా! నిన్ను ఈస్వరూపంలో చూడడానికి మాకు శక్తిచాలదు. కనుక మానవరూపం తాల్చవలిసింది' అని కోరేసరికి, ఆమెకు పుట్టిన శిశువు మనలాగా మామూలు రెండుచేతులతోనే కనపడ్డాడు.

విష్ణుమూర్తి మహిమచేత వసుదేవుడి బేడీలు ఊడివచ్చినయి. చెరసాల తలుపులు వాటికవే తెరుచుకొన్నాయి. కావలివాండ్రు ఎక్కడివాళ్లు అక్కడనే మైకంతో పడిపోయారు. అప్పుడు శిశువును చేటలో పెట్టుకుని వసుదేవ్వడు గోకులం బయలుదేరాడు.

ఆ సమయాన గొప్ప తుపాను పట్టి హెూరుమని వర్షం కురుస్తున్నది. అయితేయేం, వసుదేవుడికి దోవలో ఎట్టి యిబ్బందులూ కలగలేదు. వసుదేవుడిపైన ఒక్క- చినుకయినా పడకుండా వేయిపడగలు విప్పి, ఆదిశేషువు అతనికి గొడుగు పట్టింది. గట్లు తెంచుకుని పొంగిపారుతున్న యమునానది రెండుగా చీలి ఆయనకు దోవ యిచ్చింది.

వసుదేవుడు గోకులంలో నందుని యింటికి చేరుకునేసరికి, గోపికలందరూ మంచి నిద్రలోవున్నారు. అందుచేత అతను, పిట్టకయినా తెలియకుండా తన మగశిశువును యశోద పక్కలో వేసి, ఆమె ప్రసవించిన ఆడశిశువును చేటలో పెట్టుకుని, తిరుగా మధురాపట్టణం చేరుకో గలిగాడు. తను తీసుకువచ్చిన ఆడశిశువును దేవకి పక్కలో ఉంచి, ఏమీ ఎరగనట్లు మళ్లీ బేడీలు తగిలించుకొని బంధంలో ఉండిపోయాడు.

గోకులంలో నందుడిభార్య యశోద, శిశువును కన్నదేకాని, పుట్టినది ఏమి శిశువో, విష్ణుమాయవలన గమనించలేకపోయింది. అక్కడ ఉన్నవారందరూ 'మా యశోదమ్మకు మగపిల్లవాడమ్మా, ఏ మదృష్టమమ్మా!'అని సంబరంపడినారే కాని, అసలు రహస్యం ఒక్కళ్ళకూ తెలియదు.

అసలింతకూ, యశోద కడుపున పుట్టి, దేవకి ఒడిలో పెరుగుతున్న ఆడశిశువు ఎవరనుకున్నారు?- ఆ చిత్రకథ వచ్చేనెల చందమామలో చదవండి.




సంపుటి 4 | సంచిక 2 | సంచాలకుడు: చక్రపాణి | ఫిబ్రవరి 1949

# తాతయ్య సిద్ధాంతాలు

మన గాంధీతాత చనిపోయి ఇప్పటికి సరిగా ఒక్క సంవత్సరమయింది. కాని వారు పెట్టిపోయిన సిద్ధాంతాలకు మాత్రం ప్రపంచం వున్నంతవరకు చావు వుండదు. కాబట్టి వారి సిద్ధాంతాలు చావనంతవరకూ తాతయ్య బ్రతికివున్నట్టే.

మరి తాతయ్య సిద్ధాంతా లేమిటో మీకు. తెలుసా? (1) నిజం చెప్పటం (2) ఒకరిని హింసించకుండా వుండటం. చూశారా, ఇవి ఎంత సులభమైనవో! వీటిని ఆచరించిచూడండి, మీరుకూడా తాతయ్య అంత గొప్పవా రవుతారు.



పూజ్య బాపూజీ




అమరావతి రా జొకనాడూ
తనమంత్రిని నిట్లడిగాడు:
"ఈ కృష్ణానది తిన్నంగా
ఎచటికి ప్రవహిస్తుందయ్యా?"

మంత్రి:

శ్రీకాకుళము సమీపంగా
చిలుకసముద్రము లోకండి!

రాజు:

మున్నూటఱువది రోజు లిదే
మోస్తరుగా ప్రవహిస్తుందా?

మంత్రి:

చిత్రము చిత్రము మహాప్రభూ!
నిత్తెము ప్రవహిస్తుంటుంది.

రాజు:

ఆ పట్టణరాజుకు, మనకూ
అంతఃకలహము లెఱుగవయా?

ఈ నది నీరటుపోకుండా
ఆనకట్ట కట్టింపవలె.

రాజుమాటకా దన కత డా
రోజె కట్టపోయించాడు;
అంతట వానలు కురిసిన వా
ప్రాంతము వెల్లువ వేసింది.
జనులందఱు లబలబ లాడా
సంగతి రాజుకు చెప్పారు;
అతడది పెడచెవి పెట్టగనే
అమాత్యునకు మొరపెట్టారు.

అత డేమాలోచించాడో,
అపుడే నౌకరు నంపించి
రాజుగారి దేవిడిలోనా
రాత్రులు గంటలు గొట్టే వా
ణ్ణొంటిగా పిలిపించాడూ
ఉపాయమేదో చెప్పాడు.

రచన: 'ఏటుకూరి'

కోడికూత వినపడకుండా
మూడుగంట లగునప్పటికే
అరగంటకు నరగంటకు వా
డాఱుగంటలను గొట్టాడు.

తెలవాఱినదని రాజావా
రులికిపడుతు మఱి లేచారు,
నిద్దురకన్నులు పులుముతునే
ప్రొద్దు పొడువలేదంటాడు.
అందఱు కలవరపడ్డారూ
ఆదె ప్రళయ మ్మనుకొన్నారు.

అదిరిపోయి మనరాజా వా
రమాత్యునిం బిలిపించాడు.
అతడువచ్చి విషయమ్మడిగీ
అనుకొన్నంతై నది యనగా
'ఏమే' మని రా జంటుంటే

మంత్రి:
ఏమని చెప్పే దోరాజా!
ఏటికానకట్టను కట్టీ
నీటిని పోనీనందులకే
శ్రీకాకుళ రాజావారూ
చిచ్చర పిడుగై మండారు;
వారు కట్ట తెగగొట్టనిదే
సూరుని పొడవ ద్దన్నారు!

రాజు:
"అయితే తెగగొట్టం" డంటూ
అమాత్యునకు సెలవిచ్చాడు.
అప్పటి కప్పుడె ప్రధానుడా
ఆనకట్ట తెగగొట్టించాడు.

ఇంతలోనె తెలవాఱింది
ఏటినీరు తెరదీసింది
కరకర ప్రొద్దటు పొడిచింది
కావలసిన పని జరిగింది.





# పిల్లి సహాయం

అనగనగా ఒక వూళ్లో ఒక వర్తకుడు. అతనికి ముగ్గురు కొడుకులు. ఒక రోజున అతను ముగ్గురినీ పిలిచి, తన ఆస్తిని ఈ విధంగా పంచిపెట్టాడు: వ్యాపారం అంతా మొదటివాడికి, రెండవవాడికి గాడిదను, మూడవవాడికి పిల్లినీ.

పెద్దవాడూ, రెండోవాడూ మాటాడలేదు కాని, కడపటివాడు మాత్రం తన వంతుకు ఎందుకూ పనికిరాని పిల్లి వచ్చింది కదా అని చాలా విచారించాడు. అతని విచారం చూసి, "ఓయి పిచ్చివాడా! – నన్నుగురించి అంతతేలికగా ఆలోచిస్తున్నావేమిటి? నాకొక బూట్లు జత, ఒక సంచీ కొనిపెట్టు. నీ అన్న లిద్దరికంటే నువ్వే అదృష్టవంతుడ వని అనిపిస్తాను" అని పిల్లి ధైర్యం చెప్పింది.

పిల్లిచెప్పిన మాటలకు అతను సంతోషించి ఒక చక్కటి బూట్లుజత, అందమైన సంచీ కొని యిచ్చాడు. అప్పుడు పిల్లి షోకుగా బూట్లుజత తొడుగుకొని, సంచీ బుజానవేసుకుని కుందేళ్లుతిరిగే స్థలం చేరుకొంది. సంచీలో కొంచెం తవుడు పోసిపెట్టి, తను ఆదగ్గిరనే ఉలుకూపలుకూ లేకుండా పడుకొన్నది. తవుడు వాసన తగలగానే ఒక కుందేలు గబగబా వచ్చి సంచిలో దూరింది. ఆమట్టున బూట్లు తొడుక్కున్న పిల్లి సంచి కట్టివేసి, బుజాన వేసుకుని. రాజుగారి దగ్గరకు ప్రయాణమై వెళ్లింది.

రాజుగారిని చూడగానే సలాము చేసి "మహారాజా! మా కందా రాజులుంగారు ఏలినవారికి దీనిని కానుక సమర్పించుకున్నారు!!" అని చెప్పి, సంచిలో కుందేలును రాజుగారి ముందు పెట్టింది. ఆయన పిల్లితెచ్చిన కానుకపుచ్చుకొని. "మీ కందా రాజులుంగారితో మేము సంతోషించామని చెప్పు" అని పిల్లిని పంపించివేశారు.

యర్రమిల్లి లలిత - నర్సాపురం

భేష్, బాగున్నదనుకొని బూట్లు తొడిగిన పిల్లి మరునాడు ఉదయం కొంగలు ఉండే దిక్కుకి పోయింది. అక్కడ కొన్ని కొంగలను సంచీలో చిక్కించుకుని. మళ్లీ రాజుగారికి వాటిని బహుమతీ చేసింది రాజా వారు సంతోషించి, "పిల్లీ, పిల్లీ! నేనూ, మా రాణీ, మా అమ్మాయీ మీ కందా రాజులుంగారిని చూడవస్తాము" అన్నారు.

మహారాజులుంగారి ఏనుగ అంబారీ బయలుదేరే లోపల, బూట్లు తొడుక్కున్న పిల్లి పరుగు పరుగున పోయి యజమానిని కలుసుకుంది. "బాబాయ్, నువు నేను చెప్పినట్టల్లా చేస్తూవుండు. ముందు చొక్కా విడిచి చెరువులో దిగు" అని చెప్పింది.

పిల్లి చెప్పిన ప్రకారం అతను, చొక్కా విడిచి చెరువులో పీకలోతువరకూ దిగి నుంచున్నాడు. ఇంతలో రాజావారి అంబారీ అదారిన వచ్చేసింది. పిల్లివెళ్లి "మహారాజా! మా ప్రభువుగారు స్నానానికని చెరువులో దిగడం చూసి, వారి వస్త్రాలు దొంగలెత్తుకుపోయారు. పాపం, ఆయన నానిపోతున్నారు" అని చెప్పింది. వెంటనే రాజావారు మంచి మంచి బట్టలు తెప్పించారు. అవి ధరించేటప్పటికి అతనికి ఎక్కడలేని



అందమూ వచ్చేసింది. అతన్ని చూచి రాజూ రాణీ ముచ్చటపడ్డారు. రాజకుమార్తె మనసులో సంతోషించి, సిగ్గుపడింది కూడా. అది కనిపెట్టి ఆమె తలిదండ్రులు "ఈ కుర్రవాడు మనకు అల్లుడయితే బాగుండును!" అనుకొని, అతన్ని కూడా అంబారీలో ఎక్కించుకున్నారు.

ఇంతలో- బూట్లు తొడుక్కున్న పిల్లి మరొక గమ్మత్తు చేసింది. ఒక రాక్షసుడు నివసించే పెద్దభవనం చేరుకొని, 'ఓయి రాక్షసరాజా! ఇప్పుడు మన మహారాజావారు అంబారిమీద ఇక్కడికి దయచేస్తున్నారు. వారిని సంతోషపెట్టటానికి నువు

వినోదాలేమైనా చేయగలవా?" అంది. "ఏమైనా చేయగలను" అన్నాడు రాక్షసుడు. "మరయితే ఒక జంతువయిపో చూతాం" అని పిల్లి అన్నది. రాక్షసుడు సింహం రూపంలో కనపడ్డాడు. "అబ్బే, ఇటువంటివి అందరు రాక్షసులూ చేస్తారు. చిన్న జంతువుగా మారటమే గొప్ప. చేత నయితే చుంచుగా మారి చూపించు" అని వాడిని పిల్లి ఉసుకొలిపేసరికి, ఉబ్బిపోయి రాక్షసుడు చుంచుగా మారిపోయాడు. చుంచురూపంతో వున్న రాక్షసుణ్ణి పిల్లి గుటుక్కున మింగివేసింది.

అప్పుడు పిల్లి ఖాళీగా వున్న ఆ పెద్ద భవనంలో చక్కటి ఏర్పాటు లన్నీ చేసి, మహారాజావారినీ, పరివారాన్నీ అందులో ప్రవేశపెట్టింది. "ఇదే మా కందా రాజులుంగారి భవనం, చూడండి!" అని చెప్పి రాజావారు చూచివచ్చే లోపల అందరకూ పంచభక్ష్య పరమాన్నాలతో గొప్ప విందు జరపటానికి కూడా తగిన ఏర్పాటుచేసింది.

విందుభోజనాలైన తరువాత, తాంబూలాలు వేసుకొనే సమయంలో మహారాజావారు "పిల్లీ, పిల్లీ! మీ కందారాజులుంగారిని చూచి మేమంతా చాలా సంతోషించాము. మరి, ఆయనకు యింకా పెళ్లికాలేదని చెప్పావు కదా, మా అమ్మాయి నిచ్చి పెళ్లి చేస్తాము. ఏమంటావు?" అన్నారు.

"తప్పకుండా అలాగే చేయండి. ఐతే వారిచేత వప్పించినందుకు నాకు మాత్రం కొత్తబూట్లు జత కొనిపెట్టాలి" అన్నది. ఈ మాటకు అక్కడివాళ్లంతా నవ్వుతున్నారు.

మరికొద్దిరోజులకే మంచి ముహూర్తాన అతనికి ఆపెద్దభవనంలోనే వైభవంగా పెళ్లి జరిగింది. పెత్తనమంతా పిల్లిదే. పెళ్లిలో మహారాజాగారు పిల్లికి కొత్తబూట్లు బహుమాన మిచ్చారు.






అనగా అనగా నవాభోజరాజనే ఒక రాజు. ఆయన చక్రపట్టణం ఏలుతూ ఉండేవాడు. ఆయన భార్యపేరు లక్ష్మమ్మ. ఆవిడ చాలా దొడ్డ ఇల్లాలు. కాని, పాపం, ఆమెకు పిల్లలు లేరు. పిల్లలకోసం ఆమె ఎన్నో నోములు నోచింది, ఎన్నో వ్రతాలు పట్టింది, పేద బ్రాహ్మలకు వడుగులూ పెళ్లిళ్లూ చేయించింది. చలివేంద్రాలు పెట్టించింది. అన్నదానాలు చేయించింది. నూతులూ చెరువులూ తవ్వించింది. ఎన్నో తీర్థయాత్రలు చేసింది. కాని, పిల్లలు కలగలేదు. "ఎంత ధనముండి ఏంలాభం? పిల్లలులేని జన్మ ఏమి జన్మ? ఆడది గొడ్డుమోతు అని అనిపించుకునేకన్న ఏ అడవిలోనే మానైపుట్టటం మంచిది," అనుకున్నది లక్ష్మమ్మ.

చక్రపట్టణానికి కొంత దూరంలో జటంగముని పర్వతం ఉన్నది. అక్కడికి పోయి కఠోరమైన తపస్సుచేసి పిల్లలను కనే వరంసంపాదించాలని లక్ష్మమ్మ దీక్ష పట్టింది. మహారాజు ఆమెకు ఎన్నివిధాలో చెప్పి చూశాడు. కాని లాభం లేకపోయింది.

సంతానంకోసం తన భార్య ఎన్ని కష్టాలైనా పడటానికి సిద్ధంగా ఉన్నదని గ్రహించి, నవాభోజరాజు ఆమె తపస్సుకు అనుమతించాడు. ఊరంతా అలంకరించారు. నాలుగువీథులా తోరణాలు కట్టారు. ముగ్గులు పెట్టారు. లక్ష్మమ్మ పచ్చలపల్లకీ ఎక్కి కూర్చున్నది. పన్నెండు వందల బలగం వెంటరాగా రాణీగారి పల్లకి రాచనగరునుంచి సాగింది.

లక్ష్మమ్మ పన్నెండామడ ప్రయాణం చేసి జటంగముని పర్వతం చేరింది. అక్కడ తనవెంట వచ్చిన బలగాన్ని నిలిపి, ముగ్గురు దాదులను మాత్రం వెంట బెట్టుకుని ఆమె పర్వతం ఎక్కసాగింది



అలవాటులేక ఆమె కాళ్లు బొబ్బలెక్కి పోయాయి. అయినా ఆమె అన్ని బాధలూ ఓర్చి పర్వతంఎక్కి జటంగముని తపస్సు చేసుకునేచోటికి వచ్చింది.

ఆ ముని ఎట్లా ఉన్నాడు! ఆయన చుట్టూ చెట్లూ, తీగెలూ అల్లుకుపోయాయి. ఆయన వంటిమీదనే పక్షులు గూళ్లు కట్టుకున్నాయి. లక్ష్మమ్మ ఆయన్ని చూస్తూనే భక్తితో సాష్టాంగ పడింది.

కాని మహాముని ఆమెను పలకరించ లేదు. ఆయనను పలకరిస్తే శపిస్తాడేమో నని లక్ష్మమ్మకు భయం కలిగింది. అందుచేత. ఆయనచేత మాట్లాడించటానికి లక్ష్మమ్మ ఒక మంచి ఆలోచన చేసింది. రెండు పాయిరాళ్లు పెట్టి, కుండలో నీళ్లూ బియ్యమూ పోసి పొయిమీద పెట్టి, తన మోకాలు మూడో రాయిగా పెట్టి, కింద నిప్పుచేసింది. మంట కాస్త పెద్దది కాగానే ఆమె మోకాలు కాలింది. కాలగానే ఆమె మోకాలు లాక్కుంది. మోకాలు లాక్కోగానే కుండ ఒరిగి పడిపోయింది. అందులో బియ్యమూ, నీళ్లూ కింద ఒలికిపోయాయి.

లక్ష్మమ్మ రెండు మూడు సార్లు ఈ విధంగా చెయ్యటం జటంగముని కంట బడింది. "అయ్యో, పాపం, గొప్పయింటి బిడ్డలాగా ఉంది; అన్నం వండటమైనా చాతకాదు కాబోలు. ఈమెకు సహాయం చెయ్యకపోతే నా తపస్సంతా బూడిద పోసిన పన్నీ రవుతుంది," అనుకుని ఆ మహాముని లక్ష్మమ్మతో, "అమ్మా, మూడు రాళ్లు పెడితేగాని కుండ నిలవదు. కుండ నిలిస్తేగాని అన్నం ఉడకదు," అన్నాడు.

మహాముని పలకగానే లక్ష్మమ్మ, "స్వామీ! మీ పలుకులు నా చెవిని పడగానే నా పాపాలన్నీ పోయాయి," అంటూ తన కథ అంతా ఆయనకు విన్నవించింది.

అంతావిని జటింగమహాముని, "అమ్మా నీకు పిల్లలు కలిగే గీత బ్రహ్మ వ్రాయ లేదు," అన్నాడు.

ఈమాట వినగానే లక్ష్మమ్మ మొదలు నరికిన చెట్టులాగ కూలిపోయి శోకించ సాగింది. మునికి ఆమెమీద చాలా జాలి కలిగింది. ఆయన దివ్యదృష్టితో చూసి, లక్ష్మమ్మకు పిల్లలుమాత్రం పుడతారనీ, ఐతే ఆడపిల్లలు పుడితే తల్లికి గండమనీ, మగపిల్లలు పుడితే తండ్రికి గండమనీ తెలుసుకున్నాడు. కాని యీమాట ఆమెతో చెప్పలేదు.

"అమ్మా, ఇక్కడికి ఈశాన్య మూలగా నాగేంద్రుడి గట్టున్నది. ఆ గట్టుమీద నాలుగు మద్దిమాను లున్నాయి. ఆ మద్ది చెట్ల మధ్య ఉండే చవరంలో నాగేంద్రుడి పుట్ట ఉన్నది. ఆ పుట్టలో ఆదిశేషు డున్నాడు. పుట్టమీదుగా ఒక బాలమామిడి చెట్టున్నది. ఆ చెట్టుకు ఎన్నో కాయ లున్నాయి. నువు అక్కడికి వెళ్లి, పుట్టకు ప్రదక్షిణంచేసి దణ్ణంపెట్టుకుని, ఆ చెట్టున ఏడుపళ్లు కోసుకో. తిరిగి ఇంటికి వెళ్లి, సూర్యనదిలో స్నానంచేసి ఆ ఏడుపళ్ల రసమూ పిండుకుని తాగితివా నీకు పిల్లలు



పుడతారు," అని జటింగమహాముని లక్ష్మమ్మతో చెప్పాడు.

మహాముని చెప్పినప్రకారం లక్ష్మమ్మ నాగేంద్రుడిగట్టుకు వచ్చింది. చుట్టూ మద్దిమానులు. మధ్య పుట్ట. పుట్టమీదుగా బాలమామిడిచెట్టు. చెట్టునిండా కాయలు విరగగాచి ఉన్నవి. లక్ష్మమ్మ పుట్టచుట్టూ ప్రదక్షిణంచేసి చెట్టెక్కింది. ఆశకొద్దీ ఒడి నిండా కాయలు కోసుకుని దిగి వచ్చింది. కిందికి దిగి చూసుకునేసరికి ఏడుకాయలే ఉన్నాయి. ఆమెకు తృప్తి కలుగలేదు. రెండోసారి మళ్లీ చెట్టెక్కి అందినకాయలన్నీ

అంతా విని జటంగమహాముని, "అమ్మా నీకు పిల్లలు కలిగే గీత బ్రహ్మ వ్రాయ లేదు," అన్నాడు.

ఈమాట వినగానే లక్ష్మమ్మ మొదలు నరికిన చెట్టులాగ కూలిపోయి శోకించ సాగింది. మునికి ఆమెమీద చాలా జాలి కలిగింది. ఆయన దివ్యదృష్టితో చూసి, లక్ష్మమ్మకు పిల్లలుమాత్రం పుడతారనీ, ఐతే ఆడపిల్లలు పుడితే తల్లికి గండమనీ, మగపిల్లలు పుడితే తండ్రికి గండమనీ తెలుసుకున్నాడు. కాని యీమాట ఆమెతో చెప్పలేదు.



"అమ్మా, ఇక్కడికి ఈశాన్య మూలగా నాగేంద్రుడి గట్టున్నది. ఆ గట్టుమీద నాలుగు మద్దిమాను లున్నాయి. ఆ మద్ది చెట్ల మధ్య ఉండే చవరంలో నాగేంద్రుడి పుట్ట ఉన్నది. ఆ పుట్టలో ఆదిశేష ఉన్నాడు. పుట్టమీదుగా ఒక బాలమామిడి చెట్టున్నది. ఆ చెట్టుకు ఎన్నో కాయ లున్నాయి. నువు అక్కడికి వెళ్ళి, పుట్టకు ప్రదక్షిణంచేసి దణ్ణంపెట్టుకుని, ఆ చెట్టున ఏడుపళ్ళు కోసుకో. తిరిగి ఇంటికి వెళ్ళి, సూర్యనదిలో స్నానంచేసి ఆ ఏడుపళ్ల రసమూ పిండుకుని తాగితివా నీకు పిల్లలు పుడతారు," అని జటంగమహాముని లక్ష్మమ్మతో చెప్పాడు.

మహాముని చెప్పినప్రకారం లక్ష్మమ్మ నాగేంద్రుడిగట్టుకు వచ్చింది. చుట్టూ మద్దిమానులు. మధ్య పుట్ట. పుట్టమీదుగా బాలమామిడిచెట్టు. చెట్టునిండా కాయలు విరగగాచి ఉన్నవి. లక్ష్మమ్మ పుట్టచుట్టూ ప్రదక్షిణంచేసి చెట్టెక్కింది. ఆశకొద్దీ ఒడి నిండా కాయలు కోసుకుని దిగి వచ్చింది. కిందికి దిగి చూసుకునేసరికి ఏడుకాయలే ఉన్నాయి. ఆమెకు తృప్తి కలుగలేదు. రెండోసారి మళ్లీ చెట్టెక్కి అందినకాయలన్నీ

లక్ష్మమ్మ. "అయ్యో, నాయనా! అందరూ ఆడపిల్లలేనా? ఒక మగపిల్లవాణ్ణి అయినా కనికరించవా?" అని వేడుకున్నది.

"నీకు మగపిల్లలు కలిగినట్టయితే నీ భర్త ప్రాణం దక్కదు," అన్నాడు నాగేంద్రుడు.

"అట్లా అయితే ఆడపిల్లలనే ఇయ్యి, స్వామీ! నా సంతోషంకోసం ఒకరి ప్రాణం ఎందుకు పోవాలి? ఆడపిల్లలయితే మాత్రం నవాభోజరాజు కూతుళ్లు అనకపోతారా?" అన్నది లక్ష్మమ్మ. పిల్లలు పుట్టిన తొమ్మిది నెలలకు నాగేంద్రుడికి కానుకయిస్తానని ప్రమాణం చేసింది. నాగేంద్రుడు పుట్టలోకి తిరిగి పోయినాడు.

లక్ష్మమ్మ తన ఒడిలో ఉన్న ఏడుపళ్లూ చూసుకుని తనకు బ్రహ్మ అంతే వ్రాశా డనుకున్నది. జటంగ పర్వతం దిగి వచ్చి తన పరివారాన్ని కలుసుకున్నది. అందరూ కలిసి చక్రపట్టణం ప్రయాణమైనారు.

మహారాణి ఫలంపొంది తిరిగి వస్తున్న దని వినగానే రాజు పరమానందభరితు డయినాడు. రాణికి ఎదురుగా పల్లకీలూ బాజా భజంత్రీలూ పంపాడు. ఆమెను అన్నివీధులూ ఊరేగించారు.



రాచనగరుకు తిరిగివచ్చిన మర్నాడు లక్ష్మమ్మ స్నానంచేసి, ఒక బంగారు గిన్నెలో ఏడు మామిడిపళ్ళ రసమూ పిండుకున్నది. జటంగ మహాముని నీ, నాగేంద్రుణ్ణీతలచుకుని ఆరసం తాగేసింది. అది తాగిన ఆరు గడియలకల్లా ఆమెకు గర్భిణి చిహ్నాలు అగుపించాయి. చర్మం పాలిపోయింది. వేవిళ్ళు కలిగాయి. ఏడో గడియకెల్లా లక్ష్మమ్మ నొప్పులుపడ నారంభించింది. మూడువందల మంది మంత్రసానులు వచ్చి మహారాణికి కాన్పు చేయించారు. ఏడు గడియలలోపల ఏడుగురు ఆడపిల్లలు కలిగారు. పిల్లలు కలిగిన సంతోషముతో నవాభోజరాజు పట్టణమంతటా కండచక్కెరా, పంచదారా, వక్కలాకులూ పంచిపెట్టించాడు.

ఆడపిల్లలకు మూడో నెల వెళుతుం డగా రాజు బ్రహ్మాండంగా ప్రజలకు సంతర్పణలూ అన్నదానాలూ చేయించి, బ్రాహ్మలచేత పిల్లలకు నామకరణం చేయించాడు. సూర్యనాగమ్మ, చంద్ర నాగమ్మ, పగడాల నాగమ్మ, ఉత్తర కన్యక, దక్షిణకన్యక, మునికన్యక, బాల నాగమ్మ అని ఏడుగురికీ పేర్లుపెట్టారు.



లేకలేక కలిగిన తన ఏడుగురు పిల్లల ముద్దు మురిపాలు చూసుకుంటూ, అచ్చట్లూ ముచ్చట్లూ చేసుకుంటూ, రోజులు క్షణాలుగా గడిపివేసిందిలక్ష్మమ్మ. తొమ్మిది నెలలూ ఎట్లా గడిచాయో ఆమెకే తెలియదు. ఒకరోజున ఆమె బ్రాహ్మణ్ణి పిలిచి "శేషపౌర్ణమి ఇంకా ఎన్నాళ్ళుంది?" అని అడిగితే మూడురోజు లుందన్నాడు.

లక్ష్మమ్మకు వొళ్లు ఝల్లుమన్నది. ఇక మూడురోజులకి తనకూ పిల్లలకీ ఋణం తీరి పోతుంది. ఆనాడు నాగేంద్రుడు వచ్చి తన ప్రాణం పుచ్చుకుంటాడు. తను పోయినాక తన పిల్లల్ని ఎవరు దగ్గరికి తీస్తారు, ఎవరు చేస్తారు? తన భర్త మళ్ళీ పెళ్లాడితే ఆ రెండో భార్య ఈ పిల్లలకు సరిగా అన్నం పెడుతుందా, నీళ్ళు పోస్తుందా? వాళ్ళు దిక్కులేని పక్షులైపోతారే అని లక్ష్మమ్మ భోరున ఏడ్చింది.

ఆతర్వాత రాజుకు పిల్లలను అప్పగించి జరిగిన కథంతా చెప్పింది తనభార్యకి ఇక భూమిమీద మూడురోజులే గడువుందని తెలియగానే రాజు కుప్పగాకూలిపోయాడు.

రాజుగారి విచారంచూసి మంత్రులు, "మహారాజా! ఈ భాగ్యానికి మీరింత



దుఃఖించాలా? మహారాణీగారికి ఎటువంటి ఆపదా రాకుండా మేము అన్ని ఏర్పాట్లూ చేస్తాము" అని ధైర్యం చెప్పారు.

నడివీధిలో ఏడేసి స్తంభాలు రెండు పాతారు. వాటికి అడ్డంగా ఒక దూలం కట్టారు. దానికి ఒక బంగారు ఉయ్యాల తొట్టికట్టారు. అందులో లక్షమ్మను పడుకో బెట్టి మూతవేసి మూడుతాళాలు వేశారు. స్తంభాలచుట్టూ నిప్పుగుండాలు తవ్వారు. వాటిలో నూనెపోసి పెద్ద మంటచేశారు. పట్టణవీథుల ముఖద్వారాల దగ్గిర కత్తుల బోనులు ఏర్పాటుచేశారు. తుపాకులతోనూ, విచ్చుకత్తులతోనూ అరువందల మంది భటులను కాపాలా ఉంచారు స్తంభాలవద్ద పురాణపఠనం సాగించారు. ఇకనాగేంద్రుడు ఎట్లా వస్తాడు? లక్ష్మమ్మను ఏంజేస్తాడు?

శేషపౌర్ణమి వచ్చింది. కరకరా సూర్యుడుదయించాడు. అన్న మాట ప్రకారం లక్ష్మమ్మ రాలేదు. పుట్టలోని నాగేంద్రుడికి కోపం వచ్చింది. పన్నెండు తలలతోటీ బుసలుకొడుతూ, నిప్పులు కక్కుతూ పుట్ట లోంచి నాగేంద్రుడు బయటికి వచ్చాడు. క్షణంలో భూచక్రపట్నం చేరి, తనను చంపటానికి చేసిన ఏర్పాటంతా చూశాడు. ఆయన అక్కడే అంతర్ధానమై, లక్ష్మమ్మను పెట్టిన తొట్టిలో ప్రత్యక్షమైనాడు.

" దుర్మార్గురాలా! నాకు మాట యిచ్చి తప్పుతావా? నన్ను చంపించటానికి ఇన్ని ఏర్పాట్లు చేస్తావా? "అన్నాడు నాగేంద్రుడు.

"ఇది నా తప్పుకాదు, తండ్రీ! వాళ్ళు పాపులు. అందుచేత నిన్ను మోసంచేశారు. నీ కోరిక తీర్చటానికి నేను సిద్ధంగానే ఉన్నాను" అన్నది లక్ష్మమ్మ. వెంటనే ఆమెకు తనకూతుళ్లు జ్ఞాపకం వచ్చారు. వాళ్ళు తల్లిలేని పిల్లలవుతారనే దుఃఖంతో ఆమె మూర్ఛపోయింది. [ఇంకావుంది]






పూర్వం మగధలో ఒక రాజు వుండేవాడు. అతను ప్రజలను ఎంతో శ్రద్ధతో కాపాడు కుంటూ, అందరిచేత మంచివాడని అనిపించుకున్నాడు. కాని, అతనిలో ఒక దుర్గుణం వుంది. అది ఏమిటంటే, తను చెయ్యమని చెప్పినపనిని ఎవరైనా 'మేము చెయ్యము' అన్నా సరే, తనకు యిష్టంలేని పనిని ఎవరైనా చేసినాసరే కోపంతో మండి పడేవాడు. తన మాటప్రకారం జరిగి తీరవలసిందేనని రాజుకు గట్టి పట్టుదల. కాని రాజు చెబుతుండే పనులలో యేదో ఒకటైనా ప్రతిరోజూ యెవరో ఒకరు మా వల్లకాదు అనటమూ, వాళ్లమీద ఆయన మండిపడటమూ జరుగుతుండేది. ఈ దుర్గుణంతో పాటే. ఆయనలో మరో సుగుణం కూడా వుంది. ఎంత కోపం వచ్చినా, కొంతసేపటికి మళ్లీ 'యిలా ఎందుకు కోపం తెచ్చుకున్నానా!' అని పశ్చాత్తాప పడేవాడు.

ఒకనాడు రాజు ఒంటరిగాకూర్చుని ఇలా అనుకున్నాడు— "ప్రతిరోజూ నేను ఎవరి మీదనో ఒకరిమీద కోపగించుకోకుండా గడపటం లేదు. ఇది యేమీ బాగాలేదు. నేనుచెప్పే ప్రతిపనీ చెయ్యను అనకుండా, నాకు యిష్టంలేని పనులు చెయ్యకుండా వుండే పిల్ల ఎవరైనా వుంటే బాగుండును. నా రాణిగా చేసుకుందును" అని. కాని, ఆయనకు అలాంటిపిల్ల దొరకనూలేదు, ఆయన పెళ్లిచేసుకోనూలేదు.

ఇలావుండగా ఒకరోజున రాజు అడవికి వేటకి వెళ్లాడు. వేటాడుతూ, వేటాడుతూ అతను చాలదూరం. వచ్చేసి అడవిలో దారితప్పి తిరుగసాగాడు. గొంతు ఎండుకు పోయింది. ఎక్కడా నీరు కనిపించలేదు.

బి. యస్. జయ, మద్రాసు



ఇంతలో దూరాన ఒక పూరిగుడిసె కనిపించింది అయునకు ప్రాణం లేచి వచ్చింది. గుడిసె దగ్గిరికిపోయి, గుఱ్ఱం దిగి "ఎవరమ్మా ఇంట్లో!" అని కేక వేశాడు.

ఈ కేక విని ఒక పదహారేండ్ల పిల్ల బయటికి వచ్చింది. "చాల దాహంగా వుంది. కాసిని మంచినీళ్లు యిస్తావా?" అని అడిగాడు రాజు.

"అలాగే"నంటూ ఆ పిల్ల లోపలికి వెళ్లి మరికొంతసేపట్లో ఒకచెంబునిండా పాలూ, మరోగ్లాసులో మంచినీళ్లూ, కాసిని పళ్లూ తెచ్చి యిచ్చింది. రాజు ముందు కాసిని నీళ్లు తాగి, పళ్లు తిని, పాలు తాగాడు. అప్పటికి అతని ప్రాణం స్థిమితపడింది. అప్పుడు రాజు ఆ పిల్ల వంక తేరిపారజూచాడు.

బీదవాళ్లపటంచేత నగలు, నాణ్యాలైతే లేవుగాని, ఆ పిల్ల మొహం కళకళలాడుతు ఎంతో అందంగా వుంది. కళ్ళలో అమాయకత్వం తొణికిసలాడుతూంది. ఆ పిల్లవంక చూస్తూ, రాజు తన చేతిలో వున్న పాల చెంబు చూపి, "నీవు గనక సప్తసముద్రాల లోని నీళ్ళూ ఈచెంబుతో తోడి పారపోశావంటే నిన్ను నా రాణీగా చేసుకుంటాను. నేను ఈ దేశపురాజును" అన్నాడు.

రాజు ఈ మాట లనగానే ఆ పిల్ల యింట్లోకి వెళ్ళి ఒక గుప్పిట యిసుకతో తిరిగి వచ్చింది. ఆ గుప్పిట యిసుక చూపిస్తూ, "ప్రపంచంలో వుండే అన్ని నదులనీ ఈ గుప్పిట యిసుకతో నువ్వు అనకట్టకట్టి ఆపగలిగితే, నీవు చెప్పినట్లే నేను ఆ చెంబుతో సప్త సముద్రాలలో నీళ్లు తోడిపారబోస్తాను" అన్నది.

ఈ సమాధానం విని రాజు ఒక్కసారిగా ఆశ్చర్యపోయాడు. కాని ఎంతో సంతోషం కూడా కలిగింది. "భేష్! నీలాంటి పిల్ల కోసమే నేను వెతుకుతున్నాను" అని చెప్పి

రాజు ఆ పిల్లని పెళ్లి చేసుకోవటానికి నిశ్చయించుకొన్నాడు. ఆ పిల్ల తండ్రితో తన ఉద్దేశ్యం చెప్పాడు. "మాబోటి బీదవాళ్ళకి అంతకంటె కావలిసింది యేముంది బాబూ!" అన్నాడు ఆ పిల్లతండ్రి.

ఇకనేం, రాజు ఆ పిల్లతోసహా మళ్ళీ గుఱ్ఱంమీద తన మహలుకి చేరుకున్నాడు. ఒక మంచిముహూర్తాన పెళ్లి జరిగింది.

పెళ్లి కాబోయే ముందు ఆ పిల్ల రాజుని యిలా అడిగింది— "మీకు యిట్టే కోపం వస్తూవుంటుందని విన్నాను. అదే నిజమైతే ఎప్పుడో ఒకప్పుడు మీకు నా మీద కోపం వచ్చి వెళ్ళగొట్టడం కూడా జరుగుతుం దేమో. కాని అలా మీరు ఎప్పుడైనా నన్ను వెళ్లగొట్టవలసి వస్తే, నేను వెళ్లిపోయేప్పుడు మీ మేడలో నాకు ప్రియమైన వస్తువుని నాతో తీసుకుపోవటానికి అనుమతిఇవ్వండి. ఈషరతుకు ఒప్పుకుంటేనే నేను మిమ్మల్ని పెళ్లిచేసుకుంటాను." అన్నది.

రాజు సరేనన్నాడు.

* * *

కొన్నిరోజుల తర్వాత, ఒకనాడు రాజు భోజనం చేస్తుండగా రాణి యేదో సలహా చెప్పబోయింది. ఆ సలహా రాజుకు



నచ్చలేదు. "నీ ముష్టిసలహా ఎవరికి కావాలి? ప్రతిదానికీ నే నున్నానంటూ తయారవుతావు. నాకు సలహాచెప్పే పాటిదానివా నువ్వు! నీలాంటివాళ్లు ఇక్కడ వుండటానికే వీల్లేదు. రేపు తెల్లవారేలోగా నా మేడ వదిలి వెళ్లిపో" అన్నాడు మండిపడుతూ.

ఇలా జరుగుతుందని రాణి ముందుగానే అనుకుంది. అందుచేత లోపలికిపోయి రాజుగారుత్రాగే పాలలో మత్తు మందు కలిపితెచ్చియిచ్చింది. రాజు అవి త్రాగి తన వొళ్లు తనకు తెలియకుండా నిద్రపోయాడు.

రాణి, తన సేవకుల సహాయంతో రాజును తీసుకుని అరాత్రికి రాత్రే తన పూరిగుడిసె చేరుకుంది.

తెల్లవారింది. రాజుకు మెలకువ వచ్చి, "మేడలో నిద్రపోతున్న నేను, ఈ పూరి గుడిసెలోకి ఎలా వచ్చానా!" అని ఆశ్చర్య పడ్డాడు.

ఇంతలో రాణి అక్కడికి వచ్చి "ఏమిటి అలా ఖంగారుగా చూస్తున్నారు?" అని అడిగింది.

"నన్ను యిక్కడికి ఎవరు తెచ్చారు? ఎందుకు తెచ్చారు? వెంటనే చెప్పు" అని గుడ్లురుముతూ అడిగాడు రాజు.

"ఉండండి. కొంచెం శాంత పడండి. మిమ్మల్ని యిక్కడికి తెచ్చింది నేనే. మీ మేడనించి నన్ను మీరు వెళ్లగొట్టేలాగయితే నాకు ప్రియమైన వస్తువుని నాతో తీసుకు పోవచ్చని మీరు మాట యిచ్చారు, గుర్తుందా?" అని అడిగింది రాణి.

"అవును." అన్నాడు రాజు.

"మరి, యికనేం? మీకంటె ప్రియమైన వస్తువు నాకు ఏముంది? అందుచేతనే మిమ్మల్ని నాతో కూడా తెచ్చుకున్నాను" అని రాణి తొణకకుండా బదులు చెప్పే సరికి రాజు ఆశ్చర్యపోయాడు.

"అమ్మ దొంగా! ఎంత పని చేశావు! ఇందుకేనా పెళ్లిచేసుకునే ముందు నాచేత అలా ఒప్పందం చేయించుకొన్నావ్!! నీ మీద అనవసరంగా కోపం తెచ్చుకుని నిన్ను చాల కష్టపెట్టాను. అవి అన్నీ మరిచి పోయి మళ్లీ హాయిగా వుందాం. నీలాంటి రాణికంటె నాకు కావలసిం దేముంది?" అనిచెప్పి, రాజు మళ్లీ రాణీతో తన రాజ్యం చేరుకున్నాడు.

అనాటినించి రాజు, రాణీ చాల అన్యోన్యంగా ఉంటూ రాజ్యం చేశారు.





# పాపిష్ఠి ముఖాలు

"ఆ గుడ్డివాళ్లెవరు? వాళ్ళు ఎక్కడ వుంటారు?" అని ధీరవర్ముడు అడిగిన దానికి వృద్ధుడు యిలా చెప్పసాగాడు—

"వాళ్ళు ముగ్గురూ అక్కచెల్లెళ్ళు. ముగ్గురూ గుడ్డివాళ్లే. కాని, ముగ్గురి మొహాల మధ్యనా ఒక లొట్టకన్ను వుంటుంది. వాళ్లు ముగ్గురూ వాడుకోటానికి ఒకే ఒక కన్ను వుంటుంది. ఆ కనుగ్రుడ్డును తమ లొట్ట కంటిలో పెట్టుకు చూసిన వాళ్లకి వెయ్యి కళ్లతో చూచినంతగా అన్నీ కనిపిస్తై. ఆ కనుగ్రుడ్డును ఒకరి తర్వాత ఒకరు పెట్టుకుని చూస్తూవుంటారు. ఆ గ్రుడ్డుని ఎవ్వరూ రెండు నిమిషాలకంటే ఎక్కువసేపు వుంచుకోకూడదు. మొదటిది గ్రుడ్డుని పెట్టుకుని రెండు నిమిషాలసేపు చూస్తుంది. ఆ రెండు నిమిషాలు పూర్తి కాగానే దాన్ని రెండోది తీసుకొని పెట్టుకు చూస్తుంది. తర్వాత మూడోది. ఇలా వరస ప్రకారం వాళ్ళు ఆ ఒక్క గ్రుడ్డుతోటే చూస్తూవుంటారు. ఎవరైనా రెండు నిమిషాలకి పైన గ్రుడ్డుని ఒక్క క్షణం వుంచుకున్నాసరే ఆ తర్వాతది పోట్లాడి తీసుకుంటుంది. ఆ గ్రుడ్డు లేకపోతే వాళ్లు ఒక్క క్షణం వుండలేరు. కనుక ముందు మనం ఆ గ్రుడ్డుని వాళ్లదగ్గిర్నించి కాజెయ్యాలి" అని చెప్పాడు వృద్ధుడు.

"సరే అలాగే చేద్దాం. కాని వాళ్ళు ఎక్కడ వుంటారో చెప్పనేలేదే?" అని అడిగాడు ధీరవర్ముడు.

"సూర్యుడుగానీ, చంద్రుడుగానీ, వుండగా వాళ్లు బైటికిరారు. సాయంత్రం కను మసక చీకటివేళ వాళ్లు బైటికి వచ్చి ఆ కన్నుగ్రుడ్డు పెట్టుకుని చూసి, ఎవరైనా మనుష్యులు కనిపిస్తే పీక్కుతిని చంద్రుడు ఉదయించేవేళకి మళ్లీ మాయమవుతారు." అని చెప్పాడు వృద్ధుడు.

ఒక గ్రీకు కథకు అనుకరణ



ఇదంతా చెప్పేసరికి అప్పుడే సూర్యుడు అస్తమించాడు. చీకటి పడసాగింది. మరి కాసేపటికి వాళ్లు ఒక పెద్ద ఎడారిలాంటి చోటికి వచ్చారు. అక్కడ చిన్నచిన్న తుప్పలు దుబ్బులు తప్పితే మరేమీలేవు.

"ఇప్పుడే, ఈ చోటికే ఆముగ్గురు గుడ్డి వాళ్ళూ వచ్చేది. మనం చాల జాగ్రత్తగా వుండాలి" అని వృద్ధుడు అంటూ వుండగానే దూరాన ఎక్కడో అడుగుల చప్పుడు వినిపించింది. ఆ చప్పుడు చెవినిపడగానే వాళ్లిద్దరూ ఒకపొదచాటున దాక్కున్నారు.

ఇంతలో ఆ ముగ్గురు గ్రుడ్డివాళ్ళు అక్కడికి వచ్చి చేరుకున్నారు. వృద్ధుడు చెప్పినట్లు వాళ్లు ముగ్గురూ గుడ్డివాళ్లే. ఇప్పుడు మధ్యవున్న గ్రుడ్డిది కనుగ్రుడ్డు, తన కనులొట్టలో పెట్టుకుచూస్తోంది.

ఇంతలో మూడో గ్రుడ్డిది, "అక్కా, అక్కా, రెండు నిమిషాలు అయిపోయింది ఇప్పుడు నావంతు" అంది.

"నాకు మాత్రం తెలియదా యిప్పుడు నీ వంతు అని! కాని, ఆ పొదలవెనకాల ఎవరో వున్నట్టుగా వుంది. అదేమిటో చూచి యిస్తాను" అంది మధ్యది.

"ఓహో, నువ్వే చూడాలా ఏమిటి? నేనుమాత్రం చూడలేనా? నావంతు కనక నా కిచ్చెయ్యి. నేను చూచి చెబుతాను" అంది మూడోది.

ఈ వాదన జరిగేసరికి మూడోదానివంతు రెండు నిమిషాలుకూడా పూర్తి అయినై. ఇప్పుడు మళ్లీ మొదటిదానివంతు. అందుచేత అది, "మీరు యిద్దరూ ఎందుకు పోట్లాడుకోవటం? ఇప్పుడు నా వంతు. గ్రుడ్డు నా కిచ్చెయ్యండి" అన్నది.

ఇది వినేసరికి గ్రుడ్డుపెట్టుకునివున్న మధ్యదానికి తగనికోపం వచ్చింది. తన

ముఖంమీద లొట్టలో వున్న ఆ గ్రుడ్డుని కాస్తా వూడతీసి తన అరచేతిలో పెట్టుకుని "సరే, పోట్లాట ఎందుకు? గ్రుడ్డు నేనూ పెట్టుకోలేదు. ఇదుగో నా చేతిలోవుంది. మీలో ఎవరు తీసుకోగలిగితే వాళ్ళు తీసుకోండి" అని కూర్చొపడింది.

ఇప్పుడు ముగ్గురూ గ్రుడ్డివాళ్లే. అందుచేత గుడ్డువున్న మధ్యదాని చెయ్యి ఎక్కడ వుందో మిగతా యిద్దరికీ తెలియ లేదు. అందుచేత వాళ్ళు చేతులతో నాలుగు వైపులా తడుముకోసాగారు.

వృద్ధుడు ధీర వర్మణ్ణి హుషారు చేసి "నువ్వు ఆ గ్రుడ్డుని ఎత్తుకు రావటానికి యిదేసమయం. ఊ, పద" అని ముందుకు తోశాడు. మరుక్షణంలో ధీరవర్ముడు వాళ్ళ చేతులకు దొరకకుండా ఆ గ్రుడ్డు తెచ్చి వృద్ధుడి కిచ్చాడు.

తన చేతిలోంచి గ్రుడ్డు ధీరవర్ముడు కాజేసి పోగానే, దాన్ని మిగత చెల్లెళ్ళలో ఎవరో ఒకరు కాజేసిఉంటా రనుకొని మధ్యది పోట్లాడ సాగింది. కాని మేము తియ్యలేదంటే మేము తియ్యలేదని వాళ్ల



మొత్తుకో సాగారు. ఎంతసేపటికీ ఎవరూ గ్రుడ్డు తమకి దొరికినట్టు బయట పెట్టక పోయేసరికి, ఒకళ్ళకి మరొకళ్ళ మీద అనుమానం పుట్టింది - గుడ్డు దొరికిన వాళ్ళే ఆ సంగతి బైటపెట్టకుండా మిగతా వాళ్లని ఏడిపిస్తున్నారని. ఇకనేం ముగ్గురూ పెద్దగా అరుస్తూ పోట్లాడుకో సాగారు.

వృద్ధుడికి, పాపం వాళ్ళని చూసేసరికి, జాలికలిగింది—"ఓ పిచ్చి పుల్లమ్మల్లారా! ఎందుకు వృథా గా పోట్లాడుకుంటారు. గ్రుడ్డు నా దగ్గిర వుంది. నాకు మీరు ఒక విషయం చెప్పాలి. ఇక్కడికి దగ్గిర్లో మూడు తలల రాక్షసుడు ఒక డున్నాడట. అక్కడికి ఎలా వెళ్లాలో చెప్పండి. ఈ రహస్యం చెబితేగాని గ్రుడ్డుని తిరిగి మీకు ఇవ్వను" అన్నాడు.

"ఎవరు బాబూ నువ్వు? గుడ్డు కాజేసి పైగా మూడుతలల రాక్షసుడంటున్నావేమిటీ? మాకు ఏ రాక్షసుడి సంగతీ తెలియదు. మా గుడ్డు మా కిచ్చి నీదారిన నువ్వు పో" అన్నారు గ్రుడ్డివాళ్ళు.

"అదేమీ కుదరదు. వాడు యెక్కడ వుండేదీ మీకుతెలుసు. తెలియదని మొండి కేస్తే, యిక మీ కర్మం యింతే. గుడ్డుతో సహా మా దారిన మేము పోతాం" అని బెదిరించాడు వృద్ధుడు.

"అయ్యో! అసలే ముసలి ముండలం, మాకేమీ తెలియదని ఏడుస్తుంటే ఈయ నెవరో కన్ను ఎత్తుకుపోతానని బెదరిస్తా డేమిటే!" అన్నది మొదటి ముసలిది.

"అలాగే బెదిరిస్తాడులే. చూద్దాం కన్ను ఎలా ఎత్తుకుపోతాడో!" అంది మధ్యది.

• • •

[ఇంతకీ ఆ రహస్యం గుడ్డివాళ్లు బైట పెట్టారో లేదో తర్వాత ఏమి జరిగిందో వచ్చేనెల చందమామలో చదవండి.]






పూర్వం కాంతారపురం అనే పట్టణాన్ని ఒకరాజు ఏలుతుండేవాడు. ఆతను చాలా ఐశ్వర్యవంతుడు. లెక్కలేనంత సైన్యం కూడా వుంది. ఇన్ని వున్నా, పాపం, రాజు ఎప్పుడూ యేదో దిగులుగా వుండేవాడు. ఇందుకు కారణమేమిటో తెలుసుకోవాలని అతని మంత్రులూ, సేనానులూ ఎంతో ప్రయత్నించి చూశారు. కాని ఎవరితోనూ రాజు తన విచారానికి కారణం చెప్పలేదు.

అసలు రాజు ఇంత దిగులుపడడానికి కారణం ఏమిటీ అంటే, ఆయనవి అందరి లాంటి చెవులుకావు. గాడిదచెవులు! వాటిని కిరీటం అడుగున ఎవరికీ కనిపించకుండా చాల జాగ్రత్తగా దాచుకుంటుండేవాడు.

ఈ సంగతి రాజుగారికి క్షవరంచేసే ఒక్క మంగలి అప్పన్నకి మాత్రం తెలుసును. కాని, వాడు బయటపెడితే లోకానికంతా తెలిసి నవ్వులపాలై పోతాడుకదా! కాబట్టి వాడి ఒక్కడినోరూ కట్టివేస్తే ఈ రహస్యం యింతటితో అణిగిపోతుంది. రాజు దీర్ఘంగా ఆలోచించి, చివరికి మంగలి నోరు కట్టివేయటమే మంచిదని నిశ్చయించుకున్నాడు.

మర్నాడు మామూలుగా మంగలి అప్పన్న రాజుగారికి క్షవరం చెయ్యటానికి వచ్చాడు. అప్పుడు రాజు వాడితో, "ఒరే అబ్బీ! నాచెవులసంగతి నీకూ నాకూ తప్ప ఈ ప్రపంచంలో మరెవడికీ తెలియదు. ఇంకొకరికి తెలిసిందీ అంటే అది నీవల్లనే అయివుండాలి. అప్పుడు నీ తల తీసి వేయవలసి వస్తుంది. ఈసంగతి మనసులో పెట్టుకుని జాగ్రత్తగా వుండు. ఈ రోజునించి నీ జీతం కూడా వరహా నించి అయిదు వరహాలకి పెంచుతున్నాను" అన్నాడు.

"అలాగే మహరాజా. నేను మాత్రం పెళ్లాం బిడ్డలు వున్నవాడినికానా? నేను

ఆర్. సరస్వతి, గుంటూరు



చస్తే వాళ్లకు దిక్కులేదన్న సంగతి నాకు తెలియదా? మీ కెందుకు, చూడండి. ఈ రహస్యం పెట్టెలోపెట్టి తాళం వేసినట్టే!" అని హామీ యిచ్చాడు అప్పన్న.

ఈ హామీతో రాజుగారి దిగులు తీరింది కాని అప్పన్నకి కడుపుబ్బరం యెక్కువయింది. రాజుగారివి గాడిద చెవులన్న సంగతి అప్పన్నకి యెంతో కాలంనించి తెలుసునుగాని, అది ఇంకొకళ్ళకు చెప్పాలని వాడికి ఎన్నడూ బుద్ధిపుట్టలేదు. కాని, రాజుగారికి మాట యిచ్చి వచ్చిన దగ్గర నించీ వాడికడుపులో ఆరహస్యం దాగటం కష్టమైంది. కాని, ఎట్లా బైటపెడతాడు? ఎవరికి బైటపెడతాడు? బైటపెడిదే తన తల ఎగిరిపోతుంది కదా! పాపం! అప్పన్న ఈదిగులుతోటీ, రహస్యం దాచలేక కడుపుబ్బుతోటీ మంచం ఎక్కాడు.

అప్పన్న భార్యకి ఇతని జబ్బేమీ అర్థం కాలేదు. వైద్యుణ్ని పిలిపించింది వైద్యుడు వచ్చి నాలికా, నాడీ పరీక్షచేసి చూశాడు. తర్వాత పొట్ట వొత్తిచూసి, "నీకు ఒంట్లో ఏ విధమైన జబ్బూలేదు. నువ్వు మనస్సులో ఏదో దాచుకుని బాధపడుతున్నావు. అందుచేతనే ఈపొట్ట వుబ్బరం. అవునా?" అని అడిగాడు.

అప్పన్న నోరుతెరిచి 'అవును' అంటే ఎక్కడ నోరుజారి రహస్యం బైటపడునో అని, తలమాత్రం ఆడించి వూరుకున్నాడు.

"అది ఎవరితోనైనా చెప్పివెయ్యి. అది అంత ముఖ్యరహస్యమైతే నీ పెళ్లాంతోనైనా చెప్పు. అంతకంటె నీకు మందు లేదు" అని చెప్పి వైద్యుడు వెళ్ళిపోయాడు.

వైద్యుడు వాకిలిదాటిపోగానే అప్పన్నని భార్య "ఏమిటయ్యా, మాలావు రహస్యం? అదేదో బయటపెట్టరాదూ? నేనెవరికీ చెప్పనులే" అని వేధించసాగింది.

భార్య పట్టుదల చూసేవరకు అప్పన్నకు మరింత భయంవేసింది. అప్పన్నకు తన భార్యసంగతి బాగాతెలుసు. ఆమెకు ఏదైనా చెప్పితే ఊళ్లో టమటమా వేసినట్టే! ఇక చెప్పకపోతే, ప్రాణాలు తినేస్తుంది. అప్పన్న ఏమి చెయ్యటమా అని దీర్ఘంగా ఆలోచించి ఎలాగైనా ముందు భార్యపోరు వదిలించుకోవటం ముఖ్యమని నిర్ణయించుకున్నాడు. అలా నిర్ణయించుకుని, "ఇదుగో ఇది మా లావు రహస్యం కాదులేవే. ఎవరితోనైనా చెప్పమని సలహాయిచ్చాడు కనక ఆ వైద్యుడయ్యకే అది కాస్తా చెప్పేస్తాను. అప్పటికి నాజబ్బు నయం కాకపోతే ఆ అయ్యనే మరో మందు ఏదైనా యివ్వమని అడుగుతాను" అని చెప్పి వైద్యుడింటికి వెళ్లాడు.

అప్పన్నని చూడగానే వైద్యుడు, "ఏం, మళ్లీ వచ్చావ్?" అని అడిగాడు.

"ఏమీలేదు, బాబూ. నా మనస్సులో రహస్యం నా భార్యతోటి చెప్పెయ్యమని మీరు సలహా యిచ్చిపోయారు. బాగానే వుంది. కాని, దానినోట్లో ఏ విషయమూ దాగదు. అందుకని దానితో చెప్పేకంటే మీతో చెప్పటం మంచిదని నాకు తోచింది.



మీరు నేను చెప్పింది మరొకడితో చెప్పనని నాకు మాటియ్యండి" అన్నాడు అప్పన్న.

"చాలు, చాల్లే. నువ్వు చూడబోతే అలా మాటయిచ్చే యిలా తంటాలు పడుతున్నట్టున్నావ్. నీలాగా తెలివి తక్కువగా మాటిచ్చి తర్వాత చిక్కులు పడటానికి నేనేం పిచ్చివాణ్నిగాను. పో, పో. ఇంకెవరితోనైనా చెప్పుకో. ఎవరూ కనిపించకపోతే ఏ చెట్టుకో, పుట్టకో చెప్పుకో" అన్నాడు వైద్యుడు.

అప్పన్నకి వైద్యుడుచెప్పిన చివరిసలహా నచ్చింది. వెంటనే ఇంటికిబయలుదేరాడు. అతనికి దారిలో ఒకచోట పెద్ద పుట్ట



కనిపించింది. అప్పన్న చుట్టూ చూశాడు; ఎవరూ లేరు. ఇదే సమయమనుకొని ఆ పుట్టదగ్గిరికిపోయి, పుట్ట కన్నంలో నోరుపెట్టి "మన రాజుగారివి గాడిదచెవులు" అనేశాడు. ఈ మాటలు బైటికి అనివెయ్యగానే అప్పన్నకి కొండంత బరువు గుండెలమీదనించి దించినంత తేలికైంది. సంతోషం పట్టలేక ఒక్కపరుగున ఇంటికి వచ్చి చేరుకున్నాడు. అప్పన్నభార్య చాల ఆశ్చర్యపడింది. సంగతి ఏమిటో తెలుసుకుందామనుకుందిగాని, అడిగితే మళ్లీ ఎక్కడ మంచ మెక్కుతాడోనని భయపడి వూరుకుంది.

అప్పన్న, రహస్యం బైటపెట్టిన పుట్టపైన కొన్నాళ్లకు ఒక వెదురుపొద పెరిగింది.

మరికొన్నాళ్లకు, రాజు ఏదో శుభకార్య సందర్భాన ఒకవిందు యేర్పాటు చేశాడు. ఆ చుట్టుప్రక్కల రాజులందర్నీ ఆహ్వానించాడు. పేరుగల వాద్యగాళ్ళందరూ వచ్చి విందులో వాయించవలసిందిగా రాజాజ్ఞ అయింది.

ఈ కబురందుకున్న వాద్యగాళ్ళలో ఒక పిల్లనగ్రోవి వాద్యగాడుకూడా వున్నాడు. అతను రాజుగారివిందులో వాయించటానికి ఒక క్రొత్త పిల్లనగ్రోవి తయారుచేసుకుందామని బయలుదేరి సరిగా పుట్టమీద పెరిగిన వెదుళ్ళ పొదలోంచి ఒక వెదురుగొట్టాన్ని నరుకుకుని ఎంతో అందంగా పిల్లనగ్రోవి తయారుచేశాడు. "దీన్ని రాజుగారి ఎదట తప్పితే ఈలోగా వాయించకూడదు" అని అనుకుని బయలుదేరి రాజుగారి ఆస్థానానికి వచ్చిచేరాడు.

విందు పూర్తిఅయింది. అన్ని రకాల వాద్యాలూ వాయించడమైంది. చివరకు పిల్లనగ్రోవి వాద్యగాణ్ణి వాయించమన్నారు



# కల నిజమైంది!

అనగనగా వీరవరుడు అనే రాజు ఉండే వాడు. ఆయనకు రంగరాజు, రామరాజు అని ఇద్దరు కుమారులు.

ఒకనాడు రాజు, కొడుకు లిద్దరినీ పిలిచి "అబ్బాయిలూ! రాత్రి నే నొక కల గన్నాను. కలలో ఒక చిత్రమయిన చెట్టు కనపడింది. దానికి రాగి వేళ్లు, వెండి మొదలు, బంగారపు కొమ్మలు, పచ్చటి ఆకులు, ముత్యాలవంటి మొగ్గలు, పగడాల వంటి పళ్ళు ఉన్నాయి. ఆ చెట్టుని ఒక బంగారు ఉయ్యాల వుంది. ఆ వుయ్యాలలో ఆడే చిలుక ఆడుతున్నది, పాడే చిలుక పాడుతున్నది. అక్కడే చెట్టుకింద ఒక బంగారు లేడి పచ్చిక మేస్తున్నది. దానిని నేను మాణిక్యరాయితో కొట్టానుట! అంతటితో లేడీ మాయమయింది, చెట్టూ మాయమైంది!!—ఇదీ నాకు వచ్చిన కల. మీ రిద్దరూ వెళ్లి, ఎన్ని శ్రమలయినా పడి, నేను కలలో చూచిన మాణిక్యరాయిని పట్టుకురావాలి" అని ఆయన చెప్పాడు.

తండ్రి కోరిక నెరవేర్చటానికి కొడుకు లిద్దరూ మరునాడు బయలుదేరారు. చాలా దూరం నడిచి, వాళ్ళు అలిసిపోయారు. బడలికచేత ఒక చెట్టుకింద పడుకొనే సరికి, రంగరాజుకి వెంటనే నిద్ర పట్టేసింది. చిన్నవాడికి పని అంటే పట్టుదల. అందు చేత అతనికి కునుకే పట్టిందికాదు.

తెల్లవారినా రంగరాజుకి మెలకువ రాలేదు. నిద్ర పాడుచేయటం ఇష్టంలేక, అన్నని లేపకుండానే రామరాజు ఒక్కడూ లేచి ప్రయాణం సాగించాడు.

వెళ్ళగా వెళ్ళగా రామరాజుకి ఒక పర్ణశాల కనిపించింది. అందులో ఒక ముసలమ్మ కూర్చుని వున్నది. అతను తను వచ్చిన పని చెప్పి, అది నెరవేరే ఉపాయం చెప్పమని ఆమెను అడిగాడు.

సి. వి. ఎతిరాజులు. మద్రాసు

సరేనని అతను తన క్రొత్త పిల్లనగ్రోవిని వాయించటం మొదలుపెట్టేసరికి అది "మన రాజుగారివి గాడిదచెవులు!" అని మ్రోగింది. ఇదివినగానే వాద్యగాడి మొహాన నెత్తురుచుక్క లేదు. మళ్లీవాయించాడు: మళ్లీ అదేలామోగింది !!

పెద్ద పెద్ద రాజులందరిఎదుటా, తను ఎన్నోఏండ్లుగా ప్రాణంకంటె యెక్కువగా దాచుకున్న రహస్యాన్ని వాద్యగాడు ఇలా బైటపెట్టేసరికి రాజుకి తగనికోపంవచ్చింది. కళ్ళవెంట నిప్పులు కక్కుతూ, ఒరలోంచి కత్తిదూసి వాద్యగాడి వైపుకు ఉరికాడు.

" బాబూ, ఆగండి ! ఆగండి !! ఒక్క మాట. ఇందులో నా తప్పేమీలేదు. దీన్ని ఎవరోమంత్రించినట్లుంది. కావాలంటే మీరు స్వయంగా వాయించి చూడండి " అంటూ పిల్లనగ్రోవి రాజుగారికి అందించాడు.

సరేనని రాజు దాన్నందుకుని వాయించ బోయాడు. మళ్లీ అలాగే మోగింది- "మన రాజుగారివి గాడిద చెవులు " అని.

ఇది వినేసరికి రాజుగారికి తల గిర్రున తిరిగింది. నిలుచున్నవాడు నిలుచున్నట్లుగా కుప్పకూలిపోయాడు. తర్వాత కాసే పటికి తెప్పరిల్లుకొని, " ఇందులో నీ తప్పు ఏమీలేదు. అప్పన్నతప్పూలేదు. ఇంతకాలం ఈసంగతి కప్పిపుచ్చి లోకంకళ్లు ముయ్యటానికి ప్రయత్నించటం నాదేతప్పు. ఇక ఈ రహస్యం దాచవలసిన పనిలేదు" అంటూ రాజు తన నెత్తినవున్న కిరీటం తీసేశాడు.

రాజుగారికి మామూలుచెవులకు బదులు గాడిద చెవులుండటం చూసి వచ్చిన రాజులంతా యెంతో ఆశ్చర్యపోయారు. "దేవుడు చేసినదానికి నువ్వేమి చేస్తావ్! కాలం, కర్మం అలా కలిసివచ్చింది" అని మిగత రాజులంతా మన గాడిద చెవుల రాజుగారిని ఓదార్చి తర్వాత ఎవరి రాజ్యాలకు వారు చేరుకున్నారు.

ఇప్పుడు రాజుగారు ఏవిధమైన దిగులూ లేకుండా హాయిగా రాజ్యంచేస్తున్నాడు.



"కుమారా! ఈ అడవి దాటగానే ఒక పెద్దవృక్షము, దానికింద ఒక పుట్ట, ఆ పుట్టలో ఒక నాగుపాము ఉన్నాయి. పాము పడగమీదనే మాణిక్యరాయి ధగధగ మెరుస్తూ వుంటుంది. అయితే, అది మనకు ఎలా దొరుకుతుందీ అని అడుగుతావేమో?- 'ఇది నాపుట్ట' అని ఆనవాలు తెలియటాని కని నాగుపాము తన పడగమీది మాణిక్య రాయిని పుట్టదగ్గిర గుర్తుగా పెట్టి ఆహారం కోసం రాత్రి బయటికి పోతుంది. ఆసమయం కనిపెట్టి, ఒక తట్టతో రాయిని మూసి వేయాలి. నాగుపాము తిరిగి వచ్చి, ఇదే మిటా అనికోపంకొద్దీ ఆ తట్టను కాట్లువేసి, చివరకు ప్రాణాలు విడుస్తుంది. అప్పుడు ఆ రాయి పట్టుకురా" అని చెప్పింది. ఆమె అసలు ముసలమ్మ కాదు; దుర్గాదేవి. ఇతని మీద దయకలిగి ఆమె మర్మం చెప్పింది.

రామరాజు సరిగా ఆ ప్రకారమే చేసి, మాణిక్యరాయి పట్టుకువచ్చి ఆమెచేతికి ఇచ్చాడు. చిన్నవాని తెలివితేటలకూ, పనిలో పట్టుదలకూ దేవి సంతోషించి "నాయనా రాకుమారా!-ఈ రాయి మళ్లీ తెచ్చినచోటనే పెట్టివెయ్యి. తండ్రి పాము




వచ్చి ఆ రాయిని పట్టుకుపోతుంది. దాని వెంబడే వెళ్లితివంటే, మీ తండ్రి కలలో కనపడిన చెట్టు చూడగలవు" అని ఆమె దీవించి పంపింది.

దేవి చెప్పినట్టుగానే రామరాజు, తండ్రి పామును వెంబడించి ఒక సొరంగం ప్రవేశించాడు. కొంతదూరం వెళ్ళేసరికి ఆరు రకాల వుయ్యాలల్లో హాయిగా ఊగు తున్న ఆరుగురు నాగకన్యలు కనపడ్డారు.

వాళ్ళు ఆరుగురూ అతన్ని చూచి చిరు నవ్వుతో "ఓయి రాజకుమారుడా!—నువు



వచ్చిన పని మాకు తెలుసులే. మేము నాగకన్యలం. మమ్మల్ని రాగి, వెండి, బంగారు, పచ్చ, ముత్యం, పగడం అని పిలుస్తారు. మరి-మమ్మల్ని పెళ్లాడతావా?" అని అడిగారు. "నేను వచ్చిన కార్యం నెరవేరితేకాని నామనసు మరొక పనిమీదికి పోదు, పెళ్లిమాట తరువాత చూచుకొందాము" అన్నాడు రామరాజు.

"అయితే, విను మరి: మీ తండ్రికి కలలో కనపడిన చెట్టుభాగాలమే మేము. మా ఆరుగురునీ వరసన నిలబెట్టి ఒక్కవేటుకి తెగవేసినావంటే, మాకు ఆ చిత్రమయిన చెట్టు రూపం వస్తుంది. తెగవేసేటప్పుడు చిందిన నెత్తురు చెట్టు మొదలుకి రాసి తడివితే, మళ్లీ మేము ఎప్పటిలాగ కన్యలమైపోతాం" అని వాళ్ళు చెప్పారు.

రామరాజు సంతోషించి, "మీ రిక్కడనే ఉండండి. మళ్లీ వచ్చి మా రాజ్యానికి తీసుకుపోతాను" అని వాళ్లకు మాట ఇచ్చాడు. సరాసరి దేవివద్దకు వచ్చి, అప్పటివరకూ జరిగిన సంగతులన్నీ చెప్పాడు.

అప్పుడు దేవి, "నాయనా! ఇంతవరకూ పనులు బాగానే చక్కబెట్టుకు వచ్చావు. ఇంక కలలో మీ తండ్రి కొట్టిన బంగారు లేడినిగురించి చెబుతా, విను; అది నిజమయిన లేడికాదు. ఈ అడివిలో తిరిగే ఒక మాయరాకసి. కనపడిన మనిషినల్లా అది గుహలోకి తరుముకుపోతుంది. మోహినిరూపంతో వచ్చి, పగడపు పందెం వేయమని పురికొల్పుతుంది. పందెంలో మోసంవల్ల తనకే గెలుపు వచ్చేటట్టు చేసుకుని, ఓడినపోయినవాళ్ళని చెరలో పెడుతుంది. అది ఎలా మోసం చేస్తుందంటే- దానిదగ్గిర ఒక పిల్లి ఉన్నది. పిల్లి తల

మీద ఒక దీపం పెట్టి, దీపం తాలూకు కీనీడలోకి పాచికలు వేస్తూ వుంటుంది. ఆ చీకటిలో పిల్లి పాచికలను రాకిసికి కావలసినట్టు మారుస్తూ వుంటుంది. అయితే,—దీని కొక ఉపాయం చెబుతా: నీవెంట ఒక ఎలికెనుకూడా తీసుకువెళ్ళి, పందెం సమయంలో దానిముందు వదిలి పెట్టు. ఎలికెను చూడగానే పిల్లి దానివెంట పడుతుంది. ఇంకేముంది?—దాని ఆట కట్టుతుంది. మోహిని 'నీకు లొంగి పోయాను' అంటుంది!"

దేవి చెప్పిన ప్రకారమే నడుచుకుని, రామరాజు పందెంలో మోహినిని ఓడించాడు. అంతేకాదు. పందెంలో ఓడిపోయి చెరసాలలో ఉన్న తన అన్న రంగరాజుని కూడా విడిపించాడు. మళ్ళీ వచ్చి దేవితో అప్పటివరకూ జరిగినదంతా చెప్పాడు.

అప్పుడు దేవి తన నిజరూపందాల్చి "కుమారా! నేను చెప్పినట్టుగా చేసినందుకు గాను చిత్రమయిన చెట్టు, బంగారులేడి, మాణిక్యరాయి కనబరిచాను. ఇంక, ఆడే చిలుక, పాడే చిలుక కావాలికదా నీకు! వాటిని నేను చూపించలేను. ఇక్కడికి ఆమడదూరంలో వున్న మా అక్కయ్య



చూపించ గలదు," అని చెప్పి, ఆమె పేర ఒక ఉత్తరం ఇచ్చి అంతర్ధానమయింది!

రామరాజు ఆ వుత్తరం పట్టుకొని, పెద్ద దుర్గాదేవివద్దకు వెళ్లాడు. ఆమెకూడా చెల్లెలిలాగానే ఒక ముసలిదాని రూపంలో రామరాజుకూ కనపడింది.

"నాయనా! సప్తసముద్రాలకు అవతల ఒక కొలను వున్నది. రోజూ ఒక దేవకన్య అక్కడికి స్నానానికి వస్తుంది. స్నానం కాగానే కొలనులో వుండే తామరాకుమీద చీర పరుచుకొని ఆమె నిద్రపోతుంది. తామరతూడుతో సహా ఆమెను జాగర్తగా



తీసుకురా" అని చెప్పి, దేవి అతనిని ఒక చిలుకగా మార్చి పంపింది.

చిలుకరూపంతో వున్న రామరాజు ఏడు సముద్రాలూ దాటివెళ్లి, కొలను చేరు కొన్నాడు. అక్కడ ఒక చెట్టుకొమ్మమీద పొంచివుండి, దేవకన్యకు నిద్రపట్టగానే, తామరతూడును జాగర్తగా తుంపి, దేవ కన్యతోసహా తెచ్చి దేవికి ఒప్పగించాడు.

ముసలిదాని రూపంతో వున్నామె దుర్గా దేవి అనే రహస్యం దేవకన్యకు తెలుసు. "అమ్మా! చీర లేనిదే నేను దేవలోకంలోకి ఎలా పోగలను? నా చీర నాకు ఇప్పించు" అని దుర్గాదేవిని ప్రార్థించింది.

దేవి అప్పుడు నిజరూపందాల్చి, "సరే, నీ కోరిక నెరవేరుస్తాను. నేను చెప్పిన పురుషుణ్ణి పెళ్లాడుతావా?" అని అడిగింది.

అందుకు దేవకన్య "నా మేలు కోరే తల్లివి. ఎప్పుడైనా నీ మాటకు అడ్డు చెప్ప గలనా?" అని తన అంగీకారం తెలిపింది.

వెంటనే దేవి ఆమెచీర ఆమెకు ఇచ్చి వేసి, చిలుకరూపంలో వున్న రామరాజును మామూలుగా మార్చివేసింది. ఇద్దరనూ దీవించి వివాహంచేసి, "నాయనా, రాజ కుమారా! నీ తండ్రి కలగన్నటువంటి ఆడే చిలుక, పాడే చిలుక ఎక్కడో వున్నా యనుకొంటున్నావు కాబోలు. మీ రిద్దరే ఆ చిలుకలు రెండున్నూ! సుఖంగా ఉండండి" అని వాళ్ళ చేతులుకలిపి దేవి మాయమయింది.

భార్య అయిన దేవకన్యనూ, ఆరుగురు నాగకన్యలనూ, మోహినిరూపంతో వున్న మాయలేడినీ తీసుకొని, రామరాజు తన రాజ్యానికి వెళ్ళిపోయాడు.

మరునాడు వీరవరమహారాజు దర్బారు చేశాడు. దేశ దేశాలనించి రాజులూ మహారాజులూ వచ్చారు. నిండుసభలో చిన్నవాడు తను సంపాయించుకువచ్చిన

మా ణి క్య రా యి ని, తండ్రి చేతులలో వుంచాడు. "నాయనగారూ! నన్నూ, ఈ ఆరుగురు కన్యలనూ ఒక్క వేటుకి నరికి వేస్తే మీరు కలలో చూచిన చెట్టు కనబడుతుంది. ఖడ్గానికి అంటిన నెత్తురుతో చెట్టు మొదలు తడివితే మాకు మళ్లీ మామూలు స్వరూపాలు వచ్చేస్తయి" అని చెప్పాడు.

రామరాజు చెప్పినట్టుగానే వీరవరుడు, చిన్నికొడుకునూ నాగకన్యలనూ ఒక్క వేటుకి నరికివేశాడు. తనకు కలలో కనిపించినట్టే సరిగా - రాగి వేళ్ళు, వెండి మొదలు, బంగారపు కొమ్మలు, పచ్చల ఆకులు, ముత్యాలవంటి మొగ్గలు, పగడాలవంటి పళ్ళూ కలిగిన ఆ చిత్రమయిన చెట్టు కనపడింది. ఆ చెట్టుని ఒక బంగారు ఉయ్యాల వేలాడుతున్నది. అందులో ఆడే చిలుక ఆడుతూ, పాడే చిలుక పాడుతూ ఉన్నాయి. అక్కడే చెట్టుకింద బంగారులేడి పచ్చిక మేస్తున్నది.

మేస్తున్న లేడిని వీరవరమహారాజు గురిచూసి, తనవద్దఉన్న మాణిక్యరాయితో కొట్టాడు. మోహిని మాయమైంది. వెంటనే ఖడ్గానికి పట్టివున్న నెత్తురుతో చెట్టుమొదలు తడివేసరికి, కనుపండువుగా చిన్న కుమారుడూ, ఆరుగురు నాగకన్యలూ మామూలు రూపంలో కనపడ్డారు.




వీరవరమహారాజుకి ఇటువంటి వింత కల రావటం, పైగా కలలో జరిగినవన్నీ నిజం కావటం చూసి, దేశదేశాలనుంచి వచ్చిన రాజులందరూ ఆశ్చర్యపడ్డారు.

చిన్నకుమారుడు చేసిన ఘనకార్యాలకు మెచ్చి, వీరవరుడు తనరాజ్యం అతనికే పట్టంకట్టాడు. అతనికి ఆరుగురు నాగకన్యలనూయిచ్చి అతి వైభవంగా పెళ్ళిచేసి, తాను చీకూ చింతా లేకుండా హాయిగా విశ్రాంతి తీసుకొంటున్నాడు.



పూర్వం ఒకరాజు ఉండేవాడు. ఆయనకు తన భార్యమీద చాలా ప్రేమ. ఎల్లప్పుడూ ఆమెను సంతోషపెట్టటానికే ప్రయత్నిస్తూ వుండేవాడు.

ఆ రాజు వీణ బాగా వాయించగలడు. అతని వీణపాటకు మోడులు చిగిర్చేవి. లేళ్లూ, నాగులూ వచ్చి నాట్యం చేసేవి. అలాంటి అద్భుతమైన వీణపాటతో ఆయన తన భార్యను ఎప్పుడూ సంతోషపెట్టుతూ వుండేవాడు.

ఒకనాడు రాణి చెలికత్తెలతో తోటలో ఆడుకొంటూవుండగా ఒక త్రాచుపాము ఆమెను కరచింది. అప్పుడు ఆమె చెలికత్తెలను పిలచి, "పాము విషం నా శరీరంలోకి గబగబా ఎక్కిపోతున్నది. ఇక నేను బతకడం కష్టం. ఈసంగతి నా భర్తకు చెప్పండి" అని, మరికొంచెం సేపటికి ప్రాణాలు విడచింది.

రాజు ఈ సంగతి విని చాలా విచారించాడు. భార్యని బతికించుకోటానికి చేయగలిగిన ఉపాయాలన్నీ చేసిచూచేడు. కాని లాభంలేకపోయింది. "ఏమయినా సరే, నేను నా భార్యను విడిచి ఉండలేను. యమధర్మరాజువద్దకు వెళ్లి నా భార్యను అడిగి తెచ్చుకుంటాను" అని నిశ్చయించుకుని వీణపట్టుకు బయలుదేరాడు.

మూడు తలలూ, మూడునోళ్లూ, ఆరు కన్నులూ గల ఒక భయంకరమైన కుక్క దారిలో అతనికి అడ్డుతగిలి, మీద ఉరకబోయింది. రాజు వీణ తీసి ఆనందముగా పాడేసరికి ఆకుక్క హాయిగా నిద్రపోయింది. రాజు దానిని సులువుగా తప్పించుకుని ముందుకు వెళ్లేడు.



యం. యస్. రామలింగస్వామి, విశాఖపట్టణం

ఇంక కొంచెందూరంలో ఒక పెద్ద ద్వారమూ, దానికి పెద్ద తలుపులూ కనపడ్డవి. వాటికి తాళమువేసి ఉన్నాయి. మరి రాజు లోపలికి ఎలా వెళ్లగలడు? ఆయన మళ్లీ తన వీణతీసి వాయించాడు. తాళం విడిపోయి తలుపులు తెరుచుకున్నాయి. ఆయన లోపలికివెళ్లాడు గాని యమదూతలు అడ్డగించారు. మళ్లీ ఒకసారి వీణవాయించే సరికి ఆ దూతలు పరవశులై పడిపోయారు.

అప్పుడు రాజు సరాసరి యమునివద్దకు వెళ్లగా, "నువ్విక్కడకు ఎందుకువచ్చావు? ఎలా రాగలిగావు?" అని కసిరాడు. రాజు మారుమాటాడక వీణతీసి వాయించాడు. ఆ పాటవిని యమధర్మరాజు శాంతించి, అతనిని 'నీకేమికావాలో కోరుకో'మన్నాడు.





అప్పుడు రాజు, "నాభార్య కావాలి! అంతే," అన్నాడు. "సరే! నీభార్య నీ వెనకాలే వస్తుంది. తీసుకువెళ్లు. కాని - దోవలో నీవు వెనుకకుతిరిగి చూసేవంటే, ఆమె మరి నీకు కనపడదు" అని యముడు చెప్పాడు. ఆప్రకారం ముందు రాజూ, వెనక రాణీ వెళ్లుతూవున్నారు. కొంతదూరం వెళ్లేసరికి రాజుకి ఆత్రం ఎక్కువయి వెనుకకు తిరిగిచూచేడు. ఇంకేముంది? మరి రాణీ కనపడలేదు.

రాజు వెంటనే మళ్లీ యమధర్మరాజు దగ్గరికి వెళ్లి వీణవాయించాడు. ఆయన రాజు పట్టుదలకు మెచ్చుకొని అతని భార్యను అతనికిచ్చి పంపాడు.

చూశారా? పట్టుదలతో రాజు ఎటువంటి కష్టకార్యం సాధించాడో.




ఒక వూరిలో పేదదంపతులు ఉండేవారు. వారికి ఒక కుమారుడు. అతనికి పెళ్ళి యీడు వచ్చింది. కాని ఆస్తి లేనివాడికి పిల్లను ఎవరిస్తారూ? ఎన్నాళ్ళకూ వాడికి సంబంధాలు రాకపోవటం చూసి, పాపం, వాళ్ళకు యేమీ తోచిందికాదు.

చివరికి, వారి ఇంటి పురోహితుణ్ణి ఆశ్రయించి, "అయ్యా శాస్త్రులుగారూ! మా అబ్బాయిని ఒక యింటివానిగా చేయాలి కదా. ఆ పని మావల్లకాలేదు. ఇక మాకు మీకంటె వేరే సహాయం చేసేవారుకూడా లేరు. కాబట్టి వాడిని మీచేతులలో ఉంచుతున్నాము. వాడిని పాలముంచినా, నీట ముంచినా, మీదే బాధ్యత" అన్నారు.

సరే, ఒక పేదవానికి పెళ్ళిచేసిన పుణ్యం అయినా దక్కుతుందనే వుద్దేశంతో పురోహితుడు దీనికి వొప్పుకున్నాడు. ఆయనకు ఉపకారబుద్ధీ వుంది, మంచితనమూ వుంది, కాని లౌక్యం బొత్తిగా తెలియదు! ఉత్త అమాయకుడు. అలాంటివాడివల్ల పెళ్ళిసంబంధాలు కుదురుతాయా!

ఆ నాటినించీ మనపురోహితుడు సంబంధాలకోసం తిరుగుతూనే వున్నాడు. ఏ వూరు పోయినా, ఎవరుకనపడినా అబ్బాయి సంబంధాన్నిగురించి విచారిస్తూనేవున్నాడు. ఆఖరికి ఒకరు పిల్లనివ్వటానికి వొప్పుకొన్నారు. అయితే పిల్లవాణ్ణి చూచుకోవాలన్నారు. 'ఓ!- భేషుగ్గావచ్చి చూచుకోండి' అని పురోహితుడు చెప్పాడు.

పెళ్ళికూతురు తండ్రివాళ్ళు రేపు వస్తారనగా పెళ్ళికొడుకు తల్లికి ఏమీ తోచలేదు. పెళ్ళికొడుక్కి ఒక నగ లేదు; తనకుకూడా కట్టుకోటానికి మంచి చీరలేదు. అప్పుడామె బాగా తెలిసినవాళ్ల దగ్గరకు వెళ్ళి, కావలసిన బట్టలూ, అబ్బాయికి ఒక కమలాల జత యెరువు అడిగింది. పెళ్ళివారు

పంద్యవాడ శ్రీ వెంకట లోవరావు - రావికంపాడు

చూపులకు వస్తున్నారంటే ఎవరు మాత్రం లేదనగలరు? ఇచ్చారు. సరే, తెచ్చినవాటి లోదితీసి తనొక చీరకట్టుకుంది. అబ్బాయికి దుస్తులు ముస్తాబుచేసి చెవులకు కమలాల జత పెట్టింది.

అనుకొన్నట్టుగా మరునాడు పెళ్లికూతురు తరఫువారు వచ్చారు మామూలు మర్యాద లయినతర్వాత, 'ఇతనేనా పెళ్లికొడుకు?' అని అడిగారు. 'అవునండి, పెళ్లికొడుకు ఈ అబ్బాయేను, కాని చెవుల నున్న కమలాలజత మాత్రం ఇతనిది కాదు" అని పురోహితుడు నిజం చెప్పాడు. ఈ మాట వినగానే, పిల్లవాడు పెట్టుకొన్నవి ఎరువు కమలాలని పెళ్లికూతురు తండ్రి గ్రహించి, 'సరే, మా యింటివాళ్లను కనుక్కొని త్వరలోనే ఏసంగతీ కబురుచేస్తా' మని చెప్పి వెళ్లిపోయారు.

పెళ్లివారినించి ఎన్నాళ్లకూ మళ్లీ కబురు రాకపోయేసరికి, "ఇదంతా నీ తెలివి తక్కువ. కమలాలజతగురించి నీవు నిజం చెప్పటంవల్లనే సంబంధం తేలిపోయింది" అని నలుగురూ పురోహితుణ్ణి నిందించారు. తన తప్పుతెలుసుకుని పురోహితుడు కూడా విచారించాడు.




కష్టపడి తిరిగి, కొద్దిరోజులకల్లా పురోహితుడు మరొక ఊరినుంచి ఇంకో సంబంధం తీసుకొచ్చాడు. పూర్వం నిజం చెబితే తంటావచ్చింది కనుక, ఈసారి అబద్ధం చెబితే, పెళ్ళి కుదురుతుందని ఆయన నిశ్చయించుకుని, మునపటిలాగానే పెళ్లివారు ప్రశ్నించేసరికి, "పెళ్లికొడుకు యితనేనండి, చెవులనున్న కమలాలజత కూడా ఇతనిదే నండి," అని ఆయన చెప్పాడు.

ఈమాట వినగానే, పెళ్లివారికి అసలు రహస్యం తెలిసిపోయింది. "సరే, ఏసంగతీ త్వరలోనే చెబుతాము లెండి" అంటూ

వారూ వెళ్లిపోయారు. వారివద్దనించి కూడా ఎప్పటికీ కబురు రాకపోగా, నలుగురూ కలిసి మళ్లీ పురోహితుణ్ణి చీవాట్లు వేశారు. వారు చెప్పేవరకూ తన మాట తీరువల్లనే సంబంధం తిరిగిపోయిందని అయనకు తెలియనే తెలియదు.

'ఇదేమీ బాగాలేదు. కొంచెం లౌక్యం ఉపయోగిస్తేగాని కార్యం సానుకూలం అయేటట్టు కనపడదు. ఈ సారి నిజమూ అబద్ధమూ కాకుండా మర్మంపెట్టి మాటాడుతాను. సంబంధం రైటయితీరుతుంది' అని ఆయన నిశ్చయించుకుని 'ఈ సారి సంబంధం దాటిపోకుండా కట్టుదిట్టంగా మాటాడతా'నని వారికి మాట యిచ్చాడు. వాళ్లు చాలా సంతోషించారు.

శ్రమపడి ఆయన మళ్లీ కొద్దిరోజులకు ఇంకొక సంబంధం తీసుకువచ్చాడు. ఏ పెళ్లివారువచ్చినా, 'ఇతనేనా పెళ్లికొడుకు?' అని ముందుగా అడుగుతూనే వున్నారు. ఈ ప్రశ్నకు పురోహితుడు ఈసారి "వరుడు ఇతనేనండి. కాని, ఇతని చెవులకున్న కమలాల జతనుగురించి మాత్రం మీరడగనూకూడదు, నేనుచెప్పనూకూడదు" అని బదులుచెప్పి, 'ఈసారి చాలా తెలివిగా మాటాడాను, సంబంధం కుదిరినట్టే' అని ఆయన మనస్సులో పొంగిపోతున్నాడు.

ఈ జవాబు విన్న పెళ్లివారు ఇదంతా మోసంగా వున్నదని గ్రహించి, 'ఇంటి దగ్గర కనుక్కొని కబురు చేస్తా' మని చెప్పి చల్లగా జారుకున్నారు.

మన పురోహితుడి తెలివితేటలు ఇలా పరిణమించినందుకు ఊరి పెద్దలూ, పేద దంపతులూ కూడా చాలా విచారించి 'చాల్లెండి శాస్త్రుల్లుగారూ! మీరు సంబంధాలు తేనూవద్దు, ఏమీ వద్దు' అని ఒక్క నమస్కారంచేసి వూరుకొన్నారు.






ఈ అమ్మాయి భయపడి పరుగెత్తుతోంది చూశారూ! అలా ఎందుకు భయపడిందో తెలుసా? పువ్వులు కోసుకుందామని ఈ అమ్మాయి చెట్టు దగ్గిరికి వెళ్లేసరికి ఆచుట్టుప్రక్కల నుంచి మనిషి, కుక్క అరుపులు వినిపించినై. అందుకే ఆ అమ్మాయి భయపడి పారిపోతోంది. అక్కడ ఎంతమంది మనుష్యులున్నారో, ఎన్ని కుక్కలున్నాయో కనుక్కోండి చూదాం. కనుక్కోలేకపోతే జవాబుకు 53 పేజీ చూడండి.




# పిల్లల పెంపకం

## ఆ హా ర ం

పాపాయి పెరిగి పెద్దకావడానికి ఆహారం ముఖ్యం. హితవయిన ఆహారం మితంగా తినాలని పెద్దవాళ్లంటారు. ఎదిగే శిశువుకు ఎముకలు గట్టిపడి, కండరాలు కట్టి, ఆరోగ్యం చక్కగా ఉండాలంటే తినే ఆహారం పుష్టికరమైనదిగా వుండాలి.

పుష్టినీ, ఆరోగ్యాన్నీ ఇవ్వడంలో పాపాయికి అమ్మపాలు అమృతంవంటిది. కొంచెం ఎదిగిన పిల్లలకు ఆవుపాలైనా మంచివే. పాలలో శరీరాన్ని పెంచే పదార్థాలన్నీ శాస్త్రజ్ఞులు చెప్పినట్టుగా అమరివున్నాయి. అందుకనే అన్నివేళలా, అన్నివిధాలా పాలను మించిన ఆహారం లేదంటాను.

ఏడేళ్ళలోపు పిల్లలకు కాఫీ, టీలు ఇవ్వనేకూడదు. అవి జీర్ణశక్తిని తగ్గించి, వంటికి చెరుపు చేస్తాయి. ముద్దుకొద్దీ పిల్లలకు వెన్న, నెయ్యివంటి కొవ్వుపదార్థాలు ఎక్కువగా పెట్టరాదు. వేపుడు కూరలూ అవీకూడా అంత మంచివికావు. పిల్లలు సాధారణంగా, వేళా పాళా లేకుండా తినటానికి పెట్టమని పోరుపెడతారు. వాళ్లు అడిగినప్పుడల్లా ఏది పడితే అది ఇస్తూవుండకూడదు.

పాపాయికి బువ్వ తినిపించేటప్పుడు "దాయి దాయి, చందమామా!" అని పిలుస్తూ వాళ్ళను సరదాగా ఆడించాలి. అంతేగాని "అదిగో బూచివాడు!- చెట్టుమీద చెన్నారిగాడు!!" అంటూ భయపెట్టకూడదు. కడుపునిండిన తరవాత అన్నంపెడితే పాపాయి తుబుక్కున ఉమ్మేస్తాడు. అటువంటప్పుడు బలవంతాన కూరడం మంచిపని కాదు. మితితప్పితే అమృతమయినా విషమే అవుతుంది.

ఇప్పుడు నే చెప్పిన విషయాలు జాగర్తగా గమనిస్తారుకదూ!

---

మీ పెద్దమ్మ

---




పైన కనిపిస్తున్న తొమ్మిదిమంది బఫూనులలో ఇద్దరు తేడాగా వున్నారు. ఆ ఇద్దరూ ఎవరో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకి 53-వ పేజీ చూడండి.




కిందటిసారి ప్రత్యేకించి దీపావళికి పనికివచ్చే బాణసంచాల తయారును గురించి చెప్పాను. ఇప్పుడు— ఏడాది పొడుగునా, సరదా పుట్టినప్పుడల్లా చేసుకోవటానికి వీలయిన వినోదాలు రెండు చెబుతాను: ఇవి కాలక్షేపానికి మంచి ఆటలు. అంతేకాదు. వీటిని చేసి చూపించినప్పుడు అందరూ ఆశ్చర్యపోయి, మెచ్చుకుంటారు. పైగా, ఈ చిత్రాలు చేయుటానికి ఎంతో డబ్బు ఖర్చుకాదు కూడాను.

ఒక తెల్లకాగితం తీసుకోవాలి. ఒక నిమ్మపండు పట్టుకువచ్చి, రసంతీసి వుంచుకోవాలి. ఆ కాగితంమీద సరికొత్త పాళితో, నిమ్మరసంలో (సిరాకు బదులుగా) ముంచి, మీకు సరదాఅయిన అక్షరాలు రాసినా సరే, బొమ్మలు గీసినా సరే. రాసిన తరవాత కాస్సేపు ఎండనీయాలి. అప్పుడు కాగితంమీద ఏమయినా కనబడుతుం దనుకున్నారేమో! మచ్చుకయినా ఆనవాలు దొరకదన్నమాట.

అయితే- వెలుగుతున్న హరికేన్‌లాంతరు పయిన ఈ కాగితాన్ని పట్టుకొని, వేడి తగలనీయాలి. వేడి తగిలినకొద్దీ కాగితం అంతా బూడిదరంగుగా మారిపోయి, ఆ రంగులో మీరు రాసిన అక్షరాలో, బొమ్మలో తెల్లగా అగపడతాయి. నిజానికి. ఇది ఎంత ఆశ్చర్యకరమయిన విషయం!

ఇంకో తమాషా— ఒక చిన్న బట్టల సబ్బుముక్క పుచ్చుకొని, తెల్లకాగితంమీద ఇష్టంవచ్చిన అక్షరాలు గట్టిగా అదిమి రాయాలి. ఆ కాగితాన్ని ఈమారు బాల్చీనీళ్ళలో ముంచినట్లయితే, రాసిన అక్షరాలన్నీ స్పష్టంగా చూడవచ్చు!!



ఈ చదరం మధ్యని వున్న అందాల పాపాయిదగ్గిరికి చదరం నాలుగు మూలలా వున్న నలుగురిలో ఒకరే పోగలరు. వాళ్లెవరో కనుక్కోండి.

పజిలుకు జవాబు




49-వ పేజీలోని బొమ్మకి జవాబు :

ఏడుగురు మనుషులూ, ఒక కుక్క వున్నాయి.

51-వ పేజీలోని చిక్కు బొమ్మలకు జవాబు :

4, 9 నెంబర్లుగల ఖఫూనులు ఇద్దరూ తేడాగాఉన్నారు.

# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము :

2. బంగారము
5. మోసము
7. చెట్టు
8. నాడి
9. దారముతో వేయవచ్చు
10. రాత్రి
13. వ్యవహారము
14. సారము (తల క్రిందులు)
16. పేజీ
17. విషము




### నిలువు

1. ముఖము
2. ఇతడు పద్యములు వ్రాయును
3. నటించుట
4. కోతి
6. ఇంద్రజాలము
10. పొడుగు
11. బండి
12. ఒక బాలిక పేరు
14. చంద్రగుప్తుని తల్లి
15. కత్తి తిప్పుట

## ముగ్గులు



మిస్. పద్మావతి, ఏలూరు



కె. శాంతసుందరి, మద్రాసు

| చలంగారి రచనలు: | | |
|---|---|---|
| స్త్రీ | | 2- 0-0 |
| ప్రేమలేఖలు I | | 1-12-0 |
| ప్రేమలేఖలు II | | 1- 8-0 |
| బిడ్డలశిక్షణ | | 1- 8-0 |
| విషాదం | | 1- 0-0 |
| ఆనందం | | 1- 0-0 |
| చిత్రాంగి | [నాటకం] | 1- 8-0 |
| త్యాగం | ,, | 1- 8-0 |
| మంగమ్మ | ,, | 1- 0-0 |
| జయదేవ | ,, | 1- 0-0 |
| శశాంక | ,, | 1- 0-0 |
| సావిత్రి | ,, | 0-12-0 |
| సత్యం, శివం, సుందరం | | 1- 4-0 |
| నాటికాగుచ్ఛం | | 1- 4-0 |
| కర్మమిట్లా కాలింది | [కథలు] | 1- 8-0 |
| కన్నీటికాలవ | ,, | 0-12-0 |
| పాపం !!! | ,, | 0-12-0 |
| దైవమిచ్చిన భార్య | [నవల] | 1- 8-0 |
| మైదానం | ,, | 1- 0-0 |
| అమీనా | ,, | 1- 0-0 |
| వివాహం | ,, | 1-0-0 |
| బ్రాహ్మణీకం | ,, | 0-12-0 |
| అరుణ | ,, | 0-12-0 |
| హంపీకన్యలు | ,, | 0-12-0 |
| అదృష్టం | ,, | 1- 0-0 |
| వాళ్ళు నలుగురూ | ,, | 0-12-0 |
| పురూరవ | నాటకం | 1- 8-0 |

| వివిధ రచయితలు | | | |
|---|---|---|---|
| ఈస్టలిన్ | [నవల] | | 2- 0-0 |
| చచ్చిపోయిన మనిషి | [పద్మరాజు] | నవల | 0-12-0 |
| కదంబం | [నార్ల] | | 0-12-0 |
| పొగడదండ | [కొ. పద్మావతి] | కథలు | 0-12-0 |
| రూం-టు-లెట్ | [బాలకృష్ణశాస్త్రి] | .. | 0-12-0 |
| సిపాయికథలు | [కిప్లా] | ,, | 0-12-0 |
| మూగజీవాలు | [గోఖలే] | ,, | 1- 4-0 |
| రాజా-మంత్రీ | [యం. యస్. మూర్తి] | | 0-12-0 |
| చుక్కలూ గీతలూ | .. | ,, | 1- 0-0 |
| హర్ హైనెస్ | | | 1- 0-0 |
| పలితకేశము | [దువ్వూరి] | కావ్యం | 1- 0-0 |
| స్వప్నవాసవదత్తము | [కాటూరి] | నాటకం | 0-12-0 |
| సెలవు | [కప్పగంతుల] | | 1- 0-0 |
| ఋణవిముక్తి | ,, | | 1- 0-0 |
| సంజీవి | [ధనికొండ] | కథలు | 1- 0-0 |
| గర్వభంగం | .. | ,, | 1- 0-0 |
| ప్రియురాలు | .. | ,, | 1- 0-0 |
| తీర్పు | ,, | కథలు-నాటిలు | 0-12-0 |
| పవిత్రులు | ,, | దృశ్యనాటిక | 1- 4-0 |
| ఎర్రబుట్టలు | ,, | దృశ్యనాటికలు | 1- 8-0 |
| కళ్యాణి | [సోమంచియజ్ఞన్నశాస్త్రి] | నాటకం | 0-12-0 |
| విశ్వంపెళ్ళి | .. | .. | 0-12-0 |
| జ్యోతిర్మయి | [అ. వెం. శర్మ] | .. | 1- 0-0 |

## యువ బుక్ డిపో

పోస్టు బాక్సు నెం. **1686.** మద్రాసు, 1.

Printed and Published by B. NAGI REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors: CHAKRAPANI and K. RAJA RAO.



Chandamama Feb. '49 — Photo by B. Ranganatham

మా జోలికిమాత్రం రాకండి!



"ఏమిరా అన్నాయ్! ఇక బళ్లోకి పోదాముదారా!"

"బళ్లోకిపోయి దెబ్బలు తినటం ఎందుకే? ఇక్కడ కూచుని జామకాయలే తిందాం!"